కీర్తిశేషులు

## బసవరాజు వేంకట అప్పారావుగారు, బి. ఏ., బి. యల్.

జననము **13–12–1894** – నిర్యాణము **10–6–1933.**

ఈ కవి ఆంధ్రనియోగిబ్రాహ్మణుడు, కౌశికసగోత్రుడు, తండ్రి పిచ్చయ్యగారు, తల్లి వెంకమ్మగారు. కృష్ణాజిల్లాలో బెజవాడ దగ్గరనున్న పటమట గ్రామమున మేనమామలగు గోవిందరాజులవారియింట పుట్టి పెరిగెను.

ఈతడు ఆరవఫారమువరకును బెజవాడ C. M S. హైస్కూలులో చదివి **1912** లో స్కూలు ఫైనలు పరీక్షలో నుత్తీర్ణు డయ్యెను. తరువాత చెన్నపురిలోని ప్రెసిడెన్సీకళాశాలలో చదివి **1916** లో బి. ఏ. పట్టము నందినాడు. తదుపరి కొన్నాళ్లు ఆంధ్రపత్రికకును కొన్నాళ్లు భారతికిని సహాయసంపాదకుడుగ నుండెను. **1926** లో బి. యల్. పట్టమునంది **1927** లో బెజవాడలో న్యాయవాదవృత్తిలో ప్రవేశించెను. **1932** సంవత్సరాంతమున న్యాయవాదవృత్తి చాలించి పత్రికానిర్వహణోద్యోగమున జేరదలచి ఢిల్లీకి వెళ్లెను. అచ్చటనే మనోవైకల్యము గలిగి స్వగ్రామమునకు వచ్చి కొన్నినెలలలోనే ఈశ్వరసాన్నిధ్యము జేరెను.

ఈతడు బి. ఏ. చదువుచుండగనే తన మేనమామకొమార్తె యగు శ్రీ వేంకటరాజ్యలక్ష్మమ్మగారిని పరిణయమయ్యెను. ఈదంపతుల కొక కొమార్తెయు నొకకొమారుడును గలిగిరిగాని బాల్యముననే మరణించిరి.

అప్పారావు వాయుసందేశ మను పద్యకావ్యమును రచియించెనుగాని దాని వ్రాతప్రతి కనపడలేదు. ఈతని వచనరచనలలో ఆంధ్రకవిత్వచరిత్రము చ్చుపడినదిగాని ఆంధ్రరత్నచరిత్రము, అరేబియన్ నైట్సుకథలుఅచ్చుకాలేదు.

దేశాటనమన్నను, వినోదగోష్ఠియన్నను, కవిత్వమన్నను, అప్పారావుకు ప్రీతి. ఈతడు దర్శించని మహానగరముగాని, పుణ్యక్షేత్రముగాని, లేదు. ఈతడు చదిచూడని సారస్వతవిశేషమును గానరాదు. ఈతడు గొప్పవిద్వాంసుడు, విజ్ఞాని, రసికుడు. ఈతడు ప్రేమసాగరు డని చెప్పవచ్చును.

ఈతని గీతములందు కనబడు గొప్పలక్షణ మీ ప్రేమతరంగములే. ఈతని కవిత్వము భావగర్భితమై రసపూరితమై హృదయరంజకముగ నుండును. ఈతడు తనసుఖదుఃఖములను గాని, మనోభావములను గాని, యెంతమాత్రము దాచడు. ఈ కవి నిజముగా భావకవిసమ్రాట్టనుటకు సందియము లేదు.

# పీఠిక. *

'ఆనందో బ్రహ్మ యటన్న ప్రబలుకు నంతర్బుద్ధి నూహింపుమా' యని శంఖారావమున జేయువసూధిని ప్రణయబోధ "ప్రాణములకన్న నెక్కుడుప్రాణమైన" ప్రవరాఖ్యుడు పెడచెవింబెట్టి త్రోసివేయ, నాహంతనే కైతలల్లుచున్న నాచెవులబడి, నిమేషమ్మున నదృష్టపూర్వశోభాభాసమాన ప్రణయకవితారాజ్యమునకు నన్ను గొంపోయి, కొండొక 'మందారవనాంతరామృతసరఃప్రాంతేందు కాంతోపలవేదిపై' పారవశ్యావస్థను విడియించి యెటనో మాయమై పోయెను. నిద్దుర లేచునప్పుడు మాత్రము 'వత్సా! విశాల దృష్టి సర్వముం గాంచి యనుభవించి, మరువ కనుష్ఠింపుమా సమంజసబుద్ధిన్' అను పలుకులు చెవులమ్రోగుచుండె. లేచి తత్ప్రేమా సౌభాగ్య మెల్ల దనివితీర ననుభవించి వికసితహృదయుండనైతి. నాటగోలె నానందోపాసినై, సర్వ మానందమయముగ భావించి దైవకృప నా కుదయించిన కవితాకన్య నానందాలయసేవనే నియోగించితిని.

మాకవితాకన్య చిన్నతనమున నుండియు రాగిణి, భావనోద్దీపిత గానలోల రసజీవిని. వెన్నవలె మెత్తనౌ కన్నెవల

* ఇది కీ. శే. అప్పారావుగారు తనగీతముల వ్రాతప్రతిలో వ్రాసి యుంచిన పీఠిక.

వులు కరగి కాలువల జాలువారకమున్నె, చుక్కలలోని చందు రుకన్న నెక్కుడు బెట్టుసరియు, నవురూపుడును, లోకాతీ తుండును నగు నాదేవదేవునిపై వెఱ్ఱిప్రేమ నించి ప్రణయ సిద్ధిగాంచమి వేదన స్రుక్కుచు నాశల నల్లాడుచు, చింతాగా నము జేయుచున్నది. "మందువేసవి విలపించు కొండసోన దీన గానమున కన్నను తీయనైన" యాపె విరహిగీతముల కవితా పరిపాకము ననుభవరసికులే యెఱింగి గ్రహింతురు గాక. "పురా ణ మిత్యేవ న సాధు సర్వం, నచాపి కావ్యం నవ మిత్యవద్యం, సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే, మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః" అను మహాకవి కాళిదాసువచనముల రసహృదయు లగు పాఠకులు పాటింతురు గాక.

బసవరాజు వేంకట అప్పారావు.

---

# విషయసూచిక.

## నా క వి త్వ ధా టి




న్నెవ్వ రాపలే రీవేళా
నాధాటి కోపలే రీవేళా!
నోటపలికేదంత
పాటగా మోగేను
కోటివరహా కెత్తు
కెత్తుగా తూగేను ॥ నన్నెవ్వ ॥

గుండు తాతామంటు
కొట్టినట్టుగ నేటి
పండితులు తా రెత్తి
పరుగుచ్చుకోవాలి ॥ నన్నెవ్వ ॥

పట్టుపట్టితినంటె
వాగీశుడే వచ్చి
దాసోహమని పాట
వ్రాసి వల్లించాలి!
నన్నెవ్వ రాపలే రీవేళా
నాధాటి కోపలే రీవేళా!

# చెవిటి మల్లయ్య పెళ్లి

## (శ్రీశైలయాత్ర)

తే. గీ. . .

హృదయమా! సంద్రమునకన్న పది పదింత
లతివిశాలవు కమ్మ! దేవాధిదేవు
డగు మహాదేవు కరుణామృతంపు వాహి
నులను నీలోన కలుపుకోవలెను కాదె!

ఇది మహాదేవు సామ్రాజ్య మిచట నీకు
నీతిబాధల భయ మించుకేని లేదు
సకల శుభములు నొదవు నిస్సంశయమ్ము
శివునిపే రశుభాలకు చెంపపెట్టు!

పవను డనుకూలుడై దప్పి వాపికొనగ
కొండవాగులలో నీరు గ్రోలి తమిని
ఇటు నటులు జూడకే కాలు దిటముగాను
మెట్లపై నూని పైకెక్కు మృదులగాత్రి!

హరహరా, శంకరా, మల్లికార్జునుండ!
చేదుకో, చెవిటి మల్లయ్య చేదుకొమ్మ
టంచు సుత్సాహమున పైకి నరుగుచుండ్రి
తోడి యాత్రికు లరుగోనె తోయజాక్షి!

మూట నెత్తినబెట్టుకా మూడుకాళ్ళ
ముసలిదే కర్రి బుచ్చుకు మోహరించి
మెక్కుచుండగ చెప్పెడి దేమికలదు?
పడుచు దంపతులము భయంపడగ దగునె?

పూలపాన్పులు బరచిన నేలనైన
కాలు బెట్టినతోడనే కందిపోవు
నవ్యనవనీతగాత్రి నీ భవ్యమైన
భక్తియే ఊతగాగొని పైకి జనుమ!

పెళ్లి వేడుక జూచిపో బిలిచె నన్ను
చెవిటి మల్లయ్య, మూదె పై చేయి సుమ్మ
పెళ్లికూతురు భ్రమరాంబ పిలిచె నంచు
పెంకితనమేలనే ఆడపెళ్లిదాన!

ఈ మహాగహనాంతర సీమలోన
నీవు శ్రీగిరి భ్రమరాంబ, నేను మల్లి
కార్జునుడ, యాత్రికుల్ ప్రమథాదు లనుచు
సరస మాడుకొనుచు పైకి జనుద మబల!

## జీవయాత్ర

ఈ మహాసముద్రమ్ములో నెన్ని యెన్ని
తీరముల జేరవలయునో క్రూరమాతు
పాను లెన్నెన్ని గడవగావలెనో బేల!
ఇల్లలకగానె పండగా యేమె చెపుమ?

నమ్మదగ్గది కాదు సంద్రమ్ము తీరు
పడవ వోటిది తిన్నగా గడపగల్గు
నావికుడు వోయె చుక్కాని నీవె చేత
బూని నెగ్గింపు మీయాత్ర! పైన లేడె?

---

## నా ముక్తి

బతుకుబరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరుపుట్టి పారిపోయి
ఒకడనె యేతోటలోనొ
పాటబాడు తుండగ నా ప్రాణి దాటి యేగెనా?
ప్రాణిదాటి యేగుతుండ పాట నోట మోగెనా?

పాపఫలము నెత్తినాచగ
బతుకుతెరువు వేరులేక
దాసుడనై దాంపత్యపు
తళుకు లొలక చిట్టితో స
య్యాటలాడు తుండగ నా ఆయువు ముగిసేనా?
ఆయువుముగిసే అదునుకు ఆటలలో ఎగసేనా?

కత్తిపోట్లు తిని తిని కడు
గాయమైన పేదగుండె
బీతువోవ పరవశాన
ప్రియమారగ నాచిట్టిని
కౌగిలించుకుండగ నాకాయము సురిగేనా!
కాయము సురిగేవేళకు కౌగిలిలో కరిగేనా?

## క్లాస్ పరీక్ష

ఈవు కనుబొమ లిప్పి చిట్లించగానె
తనువు కంపిల్లి గుండెలు తల్లడిల్లి
"వాకుధోరణి"గల న్యాయవాది నయ్యు
మొదటిమాటలోనే తెల్లమొగము వేతు

* మధురమధుయామినీపీఠ మధివసించి
చల్లచూపుల జడ్జి మా చందురుండె
నవ్వె తనపర్వు (పగ్గె) బుగ్గయినట్లు కొంటె
రిక్కప్లీడర్లు నను జూచి పక్కుమనిరి.



## నా జీ వి త నా ట క ము

ఈ కపటనాటకాల నే నింక నాడ
లేను, తెరదించుడీ, కోరగాని నాలి
వేసముల వేసి, పొట్టకై మోసగించి
పరుల యాచించి లాలించి బతకలేను.

పుట్టినట్టి పౌరుషమైన పుటక మరిచి
పరునికృతికి వేసముగట్టు పాప మేల ?
నా విధురజీవితమ్మనే నాటకమ్ము
జేసి ఆడించి జగతి రంజింపలేనా ?

---

* మధురమధుయామిని సీమ కధిపతియగు
చల్లచూపుల రాజు మా చందురుండె
నవ్వె తనపగ్గె బుగ్గయినట్లు కొంటె
రిక్కకన్నెలు నను జూచి పక్కుమనిరి.

## వృథాన్వేషణము

విశ్వమం దెంతగాలించి వెదకిచూచి
నా హృదీయమయమ్మ కానట్టిచోటు
కానిపించుటలేదు నా కన్నులకును
వెఱ్ఱినై లేనిదానికే వెదకినానొ?

ఊహపై యూహ లల లట్టు లుబ్బియెగసి
ఊతలూగించు నా లోలహృదయనౌక
చెలియరో! తీరమన్నది చేరగలదొ?
మునిగిపోవునొ ప్రళయంపు ముంపులోన!



## శారదాభంగము

అమ్మరో! శారదా! యిటు లాతురమ్మ
తోడ బరువెత్తె దేకీడు మూడెనమ్మ?
నెమలివాహన మేమాయె, నెమ్మొగమ్ము
వాడి, కళదక్కి, శుష్కించి వ్రాలెనేమి?

విద్యలకు పుట్టినిల్లువై విమలకీర్తి
నెల్గుదేవివి నీ విట్లు వెఱ్ఱివోలె

నెమ్మొగమ్మెల్ల వెండ్రుకల్ గ్రమ్ముకొనగ
నటునిటులు పరువెత్తెద వక్కటకట!

కనుల కాటుక చెఱిగెను, కళలదేఱు
నెమ్మొగమ్మెల్ల నల్లనై నింద్యమయ్యె;
వదనము లలాటశూన్యమై పాడువడియె
నింత యేహ్యపు రూపము నెపుడు గనమె!

దివ్యముగ వీణ మీటుచు, తేజరిల్లు
మోమునందుండి త్రిభువనమోహనమగు
విమలగానము వెడలి లోకములనెల్ల
ప్రణయరసవార్ధి ముంపగ పరమసంత
సమున ఋషులెల్ల నాట్యముల్ సల్పుచుండ
పంచవన్నియల నెమలి పైన నెక్కి
మానస సరోవరంపు విమానవీథి
స్వైర సంచార మొనరింప శార కిట్లు
పేదవడినట్టి మోముతో పెంపుదక్కి
వెఱ్ఱివలె పర్వులెత్తెద వేల నమ్మ?
ఎప్పటట్టులు వెల్లగా నిన్నుజూచి
కన్నులు గలందుకు ఫలంబు గాంచగలనె?

## హెచ్చరిక

మంచిరోజు కాదోయి, చందమామా!
మంచిదారి కాదోయి, చందమామా!

ఇంద్రధనసు విమానాన
చందమామ! యెచటికంత
తొందరగా బోయ్యేవోయ్
ముందు కీడు తెలియదేమొ!
మంచిరోజు కాదోయి చందమామా!
మంచిదారి కాదోయి చందమామా!

కవిలా గున్నావు నీకు
కానరాదొ కిందు మీదు?
* మిత్రిలా తమస్సు నిన్ను
మింగి గుటక వేసేనోయ్
మంచిరోజు కాదోయి చందమామా!
మంచిదారి కాదోయి చందమామా!

* మిఠాయిలా తమసు

## యమునా సాంత్వనము

ఏలా పాడే నింక యమునాకళ్యాణి, నే
లీలామానవుడు గోపాలుడు లేడాయె?     ॥నేలా॥

బంగారు గనులలో
చెంగలించే వేళ
పిడుగు బోలినవార్త
వినిపించినా రయ్యో     ॥ఏలా॥

చెడువార్త వినగానె
చెవులు గింగురుబోయె
ఎంత చించుకొన్న
గొంతు పెగలదాయె     ॥నేలా॥

వెన్నెలకు తోడు మా
వేణుగోపాలుడు
కన్నుల పండువుగ
కనిపించకుంటేనే     ॥నేలా॥

ఈనాటి యీ నేస్త
మే జన్మకో తిరిగి

కన్నీళ్ళు గారవకె
కడుపు చెరు వయ్యేనే
నేలా బాడే నింక యమునాకళ్యాణి, మా
లీలామానవుడు గోపాలుడు లేడామె!

## దగాయాత

"ఈదుతున్నా నీదుతున్నా
నీ సముద్రములో దగాగా
ఈదుతున్నా నడ్డగోలుగ
నీదు తున్నాను!"

"ఈదుతున్నావా దగాగా
నీది నీవే అనుభవించే
వీదకోయీ అడ్డగోలుగ
నీద బోకోయీ!"

# గోపాలకృష్ణుడు

(అసావేరి రాగము)

ఏమని పాడితివో
    గోపాలకృష్ణా
ఏమని పాడితివో?
భామలు పదియారువేలు
పరవశలై సొక్కి సోల ॥నేమని॥

బృందావన మా
నందమయముగా ॥నేమని॥
యమునా నదిలో
నమృతము పొంగగ ॥నేమని॥
వెన్నెల లెల్లెడ
వెల్లివిరియగా ॥నేమని॥
లోకము లన్నియు
లోలాడంగా
    నేమని పాడితివో
    గోపాలకృష్ణా
    ఏమని పాడితివో?

# చంద్రగ్రహణము

రాబోకు రాబోకురా చందమామ!
రాహు పొంచున్నాడురా తోవలోన!

ఆ కొక్కుపైనాను
అల్లాడకున్నాది,
మబ్బుల్లపై నేదో
మాయకప్పేసింది! ॥రాబోకు॥

తెల్లన్ని నీ కాంతి
నల్లనయ్యేనురా!
చల్లన్ని నీ మోము
సన్నగిల్లేనురా! ॥రాబోకు॥

పరమ రాకాసిరా
పాపిష్టి రాహువు,
మిత్తిలా నిను బట్టి
మింగబొయ్యేనురా?

రాబోకు రాబోకురా! చందమామ!
రాహు పొంచున్నాడురా తోవలోన!

## కోణంగిపద్దు

పన్నెండేళ్ళ చిన్నాడే
పైట కొల్ల గొన్నాడే
అడగవమ్మ అడగవమ్మ
అమ్మ యశోదమ్మా!

చీకటైన కాలేదే,
రాకపోక లాగలేదే!
లోకానికి జడవొద్దా?
పోకళ్ళకి అదు పొద్దా? ॥పన్నెండేళ్ళ॥

ఇంటి కిల్లాలినిగాదే
కంటబడితె తంటాలానె!
అంటే నీకు కోపమొద్దే
కొంటే కోణంగిపద్దే! ॥పన్నెండేళ్ళ॥

వొట్టే నలుగురిలో తల
గొట్టినట్టు లాయెనమ్మ!
ఏంతో టబ్బురాలైనా
ఇంతపనులు జేసేనా?

పన్నెండేళ్ళ చిన్నాడే,
పైట కొల్లగొన్నాడే
అడగవమ్మ అడగవమ్మ
అమ్మ యశోదమ్మా!

## గురువర్య

పాడదలచిన పాట లన్నీ
నానోట
పాడించ మనసాయెనయ్యా ?
గురువర్య ?

నీవు నేర్పిన పాట
నీ సన్నిధినె నోట
పాడిచూపేకన్న
భాగ్య మేముందయ్యా ॥పాడదలచిన॥

పాటలో దొర్లే
అపస్వరా లన్నింటి
సవరించుకొని నీవె
సద్దుకొని పోవాలి !

పాడదలచిన పాట లన్నీ
నానోట
పాడించ మనసాయెనయ్యా ?
గురువర్య !

...............?

నోరు విడబడు తున్నదయ్యా,
గొంతులో,
జీర తెగిపోతున్నదయ్యా!
మాట లిపుడిపుడేను
నోట పడుతున్నాను,
పాట లేమైనాను
పాడగలనేమోను! ॥నోరు॥

మూగనయ్యే నంచు
రాగమే రాదంచు
యేగతౌనో, యంచు
నెంతో దిగులాయెగా! ॥నోరు॥

పుట్టినందుకు ఫలము
పొందగల నేమోను
అచ్ఛారె! యని నీవె
మెచ్చగలవేమోను!
నోరువిడబడుతున్నదయ్యా,
గొంతులో
జీర, తెగిపోతున్నదయ్యా!

## కైపు

కావ్యపానమ్ము జేసి
 కైపెక్కినానే!
దివ్యలోకాలన్ని
తిరిగొచ్చినానే!
 ఎక్కరానికొండ
 లెక్కివచ్చానే!
 పైకెక్కి నీకేసి
 పారజూశానే! ॥కావ్య॥

కావ్యదేవత నోట
కవిత విన్నానే
చీమ లనిపించారె
భూమిలో కవులు!
 కావ్యపానము జేసి
 కైపెక్కినానే!

## యశోధరా విలాపము

లేపన్నైనా లేపలేదే!
మోము
చూపన్నైనా చూపలేదే!
కోపకారణ మేమొ
యేపాప మెఱుగనే! లేపన్నైనాలేపలేదే!

హృదయ తల్పముపైన
సొద మరిచి హాయిగా
నిదురదోగే నన్ను
వదిలి పోయేవేళ లేపన్నైనాలేపలేదే!

మబ్బు కన్నెల కింత
ఉబ్బుతబ్బిబ్బేలా?
ఆకాశమున కంత
ఆనంద మెందుకో? లేపన్నైనాలేపలేదే!

మాధవీలత కింక
మంటికౌగిలి యేన?
మాషటింతల నింట
దీప మిక వెలిగేన! లేపన్నైనాలేపలేదే!

ద్వారమా! నాథు
డే దారిబడి పాయెనే?
కన్నిబాబా! నీకు
కలలైన రాలేద?
    లేపలైనా లేపలేడే?
        మోము
    చూపనైనా చూపలేదే!



## ఉత్తుత్త పెళ్ళి

పెళ్ళిపందిట్లోన పెద్ద లంతాను
  వేంచేసి వున్నారు పెళ్ళికొడు కేడి?
    ముత్యాలముంగిట్లొ ముత్తైదులంతా
    కూచునుండిరి పెళ్ళికూతు రేమాయె!

  బాజా భజంత్రీలు పల్లకీవాళ్ళు
  కచ్చేరి సావిట్లొ కాచుకున్నారు!
    వీధి వీధుల ప్రజలు వేలాదివేలు
    వేచియున్నారైతె పెళ్ళుత్తదేనా?

## భూ దే వి

అమ్మా వో భూ దేవీ!
నమ్మితిమమ్మా నిన్నే! అమ్మా వో భూదేవీ!
నీరుపేరు చెపితె గుండె
నీరయిపోయే నమ్మా,
నిప్పుపేరు చెపితె ప్రాణి
గుప్పు నెగిరి పోనమ్మా! ॥అమ్మా॥
గాలిపేరు చెపితె మాకు
కాలుసేతు లాడవమ్మ,
ఆకాశమ్మంటే మా
కసలే భయ మౌనమ్మా! ॥అమ్మా॥
కొండకోనలయినగాని
ఘోరారణ్యాలుగాని
మేడలైనగాని చెట్ల
నీడలే నెడారిగాని, ॥అమ్మా॥
తల్లిపక్కలోన చిన్ని
పిల్లలు బజ్జున్నలాగు
నిన్ను నమ్మి నిబ్బరముగ
నిద్దరబోయేమమ్మా!
అమ్మా వో భూ దేవీ!
నమ్మితిమమ్మా నిన్నే!

## ప్రళయాగ్ని

మండుకొని పోతున్న వండోయ్
లోకాలు
మంట లార్పేయంగ రండోయ్!
జ్వాల లాకసమంట
నాలుకలు జాపేను
కాలానల మ్మిదే
కాబోలు దైవమా!
మండుకొని పోతున్న వండోయ్ లోకాలు॥
ఎన్ని సంద్రాలైతె
యీ మంట లారేను?
ఆరకుంటేను లో
కాలు భస్మాలౌను!
మండుకొనిపోతున్న వండోయ్॥
మనుజమాత్రుల కిట్టి
మంట లార్పగ నౌనె?
కరుణించి కాసింత
కనుమియ్యి ప్రళయేశ!
మండుకొని పోతున్న వండోయ్
లోకాలు
మంట లార్పేయంగ రండోయ్!

## కయ్యాల విందు

గయ్యాళి పెళ్లాన్ని
　　కట్టుకుంటేను
కయ్యాల కెన్నటికి
　　కరువు లేదండీ!

కయ్యాలతో మేడ కట్టించుతాము,
వియ్యాలవారి కది విడిది కిస్తాము!
కయ్యాలతో వంట
కాలు వండేము,
బంతులలో కవే
వడ్డించుతాము!

కయ్యాలె అల్లుడికి
కట్నమిస్తాము!
చుట్టపాతల కవే
చుట్టపెడతాము!

డాబులు

కావ్య మల్లే నంచు
గంతులేసేవు,
కావ్యమే జీవముగ
గడుపుతున్నామె?

రాసిపెట్టిందంత
రసవంత మంటావు!
రసరహస్య మొక్క-
రవ్వైన తెలుసునా? ॥కావ్య॥

చిట్టి నా చెవిలోన
జెప్పు రాశ్నైపువలపు
పలుకులో అచ్చరము
విలువున్నె నీకైత?
కావ్య మల్లేనంచు
గంతులేసేవు
కావ్యమే జీవముగ
గడుపుతున్నామె?

## నీటి బుగ్గలు

జీవమా! చెలి నీకై సృజింప బడెనె
అట్టిదానిని నీ వెట్టు లవల ద్రోతు?
ధనము ఘన మొకొ? సౌఖ్యసాధనము ఘనమొ
చిత్తమా! నీవె యోచించి చెప్పరాదె!

చెలియయ్యెఁ జక్కదనమున చిన్నవోదు,
తెలివి గలది సద్గుణశీల, దీప మాను
నాదు గృహమున కట్టి యా నాతి విడువ
చిత్తమా! యెట్లు యోచన జేసితీవు?

చెట్టబట్టెదుగా వేరు చెలి నెవతెనో
అల్ల యా నాతి మంచి దానంచు నీకు
నమ్మక మదేమి? బ్రతికినన్నాళ్లు కష్ట
కూపమున మున్గి చచ్చిపోగోరుకొనెదె?

చేత నున్నట్టి ధనమును జేతులార
పారవేయునె యెంత నిర్భాగ్యుడైన?
నీటిబుగ్గల నమ్మకు నేటదుముక
కొట్టుకొనిపోవె, యో వెర్రి కుట్టి మనమ?

వేగిరము వద్దు, చనవద్దు వెర్రినిబడి,
పేర్మి నదె బూని యోచించు వెనుకముందు
చేతి ధనమును వీడకు చేతులార,
నీటిబుగ్గలపై వల దేట దుముక!



## వియోగివిలాపము

కన్నులకు న్నిదురరాదు
ఎన్నో చింతలు వేచెదు
కన్నె నిన్ను వీడి ఒంటి
నిన్ని వెతలు బడుచుంటినె!
మెత్తపాన్పుపైన వలపు
మత్తత నిను గూడెదు నే
నుత్త కటికనేలను మే
నొత్తుకొన బరుంటి నిపుడు!
చిలుకపలుకులం బలె నీ
నులకు విందునలిపి వలపు
గొలుపు నీదు తియ్యనైన
పలుకులు విననోచనైతి!

మది గల తమిమంటలార
వదలని బిగికౌగిట ని
న్నెద నెద గదియించెడు సం
పదకు పెట్టి పుట్టనైతి!
సొగసు గుల్కు నీదు ముద్దు
మొగము గాంచి మది వేచెడు
వగపు మరచి వలపుకలిమి
నగుటుండునె యీ జన్మకు?
కలలోనైనను కనుపడి
చెలియా, యీ దీనుని మది
యలజడి యంతయు బోవగ
కలసి వలపు దీర్చలేవె?

## మా య మై పో తె

మగువరో యింతలో మాయమైపోతే,
మాటాడకుండనే మాయమైపోతే,
మల్లెపూజాడలనె మాయమైనావె,
మనుగొట్టి కనులలో మాయమైపోతే?

మండు వేసవియెండ పండువెన్నెలయట్లు
భావించి నీకునై పరుగెత్తి వచ్చితినె
మగువరో! యింతలో మాయమైపోతే?

నోరార దాహమున కోరికల నువ్విళ్ళ
నూరి ప్రాణము నిల్పి పారి వచ్చితినే
మగువరో! యింతలో మాయమైపోతే?

వడదాక నెమ్మేను పడిపోయి తరువట్లు
కడగండ్లు దీర్తు వని వడిలేచి వచ్చితినె
మగువరో! యింతలో మాయమైపోతే?

ఇంత మోసము జేయ నింతి నీ కేలనే
భ్రాంతి గొన్నందులకు వంతగూర్చితివే
మగువరో యింతలో మాయమైపోతే?



## పలుకవేలనే?

కల కలలాడుచు
కిల కిల నవ్వుచు
కలికీ! నాతో
పలుక వేలనే?
వలపు నీపయిం
గలిగెను నిజముగ
పలుకకున్న నెద
నిలుప జాలనే!
తలపులు నిను విడి
తొలగకున్నవే,
అలరన్ వీనులు
పలుక రాదటే?
చలువ వెన్నెలల
నలమ జేసి మది
నలరిచె చంద్రుడు
చల మింకేలనే?
చెలియరో నీ మది
వెలిగెడు వలపుం
దెలిపి ప్రాణములు
నిలుప రాదటే?

## తెలియని వలపు

ఎంతటి చపలుండ నైతి
నెంతటి మందమతినైతిని
యింత జ్ఞాన మున్న కలనె
ఇంతి నీదు ప్రేమ మఱువ ?

గీ. చేతులను నెత్తి ముద్దాడి చెలియ! నిన్ను
చంక నెత్తుకు నాడించి సంబరపడి
మూపు నుప్పుప్పుగోనెలు మోసి మురిసి
కడ కిటులు గాంగ గల్పితి జ్ఞాన మెల్ల !

గీ. 'బాల! నీపతి యెవ' రన్న 'బావ' యనుచు
ముద్దులొల్కెడి మోముపై ముసిముసి నగ
వల్ల నల్లన మెఱయంగ నాత్మ వెలుగు
ప్రణయమును దెల్పుదువుగాదె! ప్రాణసఖియ!

గీ. పెట్టెలోబడి, మతి వోయి వెంగలినయి,
దైవికములగు ప్రేమబంధముల ద్రెంచు
పాపకర్మము దలపెట్ట పడతి! నీవు
మంచిపని గాదనుచు బుద్ధి మరుపలేదె?

గీ. ఎప్పు డింటికి వచ్చునా ఎపుడు కనుల
కరువుదీరంగ గాంతునా కాంతు నంచు

కలలనైతము నాకయి కలువరించు
చెలియ నీ వుండ నా సిరి చెప్పనౌనె?

కన్నె! చపలత వోయె నింక ప్రి
సన్నవై నన్నాదరింపవె!
విన్నపము గాని మరువగదె నా
చిన్నతనపు బనుల్.

సత్య మరయంగల్గి తిప్పుడు
సఖియరో నా భాగ్యవశమున
కుదుటపడె నెమ్మనము, నావగు
కోర్కు లీడేరున్.

కష్టసుఖముల నొక్కతీరై
కలుగుదానిం దృప్తి గుడుచుచు
చింత లేమియు లేక ముదమున
జెలగుదము చిరము.

బ్రతికియున్నన్నాళ్లు నొండొరు
బాయకుండగ ప్రేమసంద్రము
నీదుదము చల్లనౌచూపుల
నీశ్వరుడు చూడన్.

## సౌఖ్యమే లేదా?

సౌఖ్యమే లేదా
లోకమున
సౌఖ్యమే లేదా?
కమలలోచనల
కౌగిళులందున ॥సౌఖ్య॥

ముద్దులబిడ్డల
మురిపెపుమాటల ॥సౌఖ్య॥

తల్లిదండ్రిలను
తగ కొలుచుటలో ॥సౌఖ్య॥

బీదసాదలను
ప్రేమ జూచుటలో ॥సౌఖ్య॥

చెలులకు సాయపు
చేయిచ్చుటలో ॥సౌఖ్య॥

భగవంతుని మది
భక్తి గొలుచుటలో ॥సౌఖ్య॥

# ఆ న ం ద మే లే దా ?

ఆనందమే లేదా
లోకమున
నానందమే లేదా ?
ప్రకృతి యందములు
పరికించుటలో ॥ఆనంద॥

ఇంపగు నీ సెల
యేటి గానమున ॥ఆనంద॥

కూ కూ యను నీ
కోయిలపాటల ॥ఆనంద॥

వీనులవిందా
పిట్టలబాసల ॥ఆనంద॥

పూవులు దాల్చిన
పూర్వపు శోభల ॥ఆనంద॥

చిగురుటాకుల
నగు వసంతమున ॥ఆనంద॥

అరుణములౌ సాం
ధ్యారాగంబుల ॥ఆనంద॥

మై మఱపించెను
మలయవాయువుల ॥ఆనంద॥

పాఱెడు మబ్బుల
పందెపు పరుగుల ॥ఆనంద॥

మొగిలు కన్నియల
ముద్దు మోములను ॥ఆనంద॥

చక్కదనంబుల
చందమామ గన ॥ఆనంద॥

మిన్నున చుక్కల
మిన్కు మిన్కులను ॥ఆనంద॥

చలువ వెన్నెలల
సయ్యాటలలో ॥ఆనంద॥

అలరుం దేనియ
లాని పాడుటలో ॥ఆనంద॥

తీయనిపండ్లను
దిని యాడుటలో ॥ఆనంద॥

కీచురాయి వెత
కీయని పాడగ ॥ఆనంద॥

నిశీథముల గను
నిశ్శబ్దములో ||ఆనంద||
చోద్యపులోకము
చూపు నిద్రిలో ||ఆనంద||
పులుగుల మేలొ్కలు
పులు విని లేపగ ||ఆనంద||
ప్రభాతవాయువ
బరవశ మొందగ ||ఆనంద||
దేదీప్యంబుగ
తేజరిల్ల మిను ||ఆనంద||
బాలభాను డం
బరమున వెల్గగ ||ఆనంద||
లోచనంబులకు
లోకము గన్పడ ||ఆనంద||
ఆదర్శములా
కాశము నంటగ ||ఆనంద||
పొంగెడు నాసలు
పురికొల్పగ మది ||ఆనంద||

భగవంతుని కడు
భక్తి బాడగను
ఆనందమే లేదా
లోకమున
నానందమే లేదా?

ఎది కావలెనే?

ఇది సంపెగ పూ
విది మల్లెపూవు
ఎది కావలెనే?
చెలియా!
ఇది మామిడిపం
డిది జామపండు
ఎది కావలెనే?
చెలియా!
ఇది ద్రాక్షారస
మిది పూవుదేనె
ఎది కావలెనే?
చెలియా!

ఇది వైడూర్యం
బిది మేల కెంపు
ఎది కావలెనే!
చెలియా?
ఇది కృష్ణప్రేమ
మిది మిత్రప్రణయ
మెది కావలెనే
చెలియా?



కవి జీవితము

కవి యని కీర్తిని
గాంచుట కన్నను
ఘన మే మున్నది
జగతిక?

కష్ట సుఖమ్ముల
చవి జూచుటకన్న
మృష్టాన్నం బెటు
రుచిరా?

వలపుమంట మిఁగ
గు కన్న హాలా
హాలము మింగు టెటు
గొప్పరా ?

ప్రణయ వేదనల
పాడుట కన్నను
పరమా మోదం
బెదిరా ?

మృత్యు వైభవము
కీర్తించుటకన్న
నిత్యానందము
కలదే ?

ఆనందలోక
మరయుట కన్నను
కానని సౌఖ్యము
కలదా ?

సౌందర్యోపా
సనమున కన్నను
సచ్చరిత మెయ్యది
చెపుమా ?

భావిశాశ్వతము
జీవించుకన్న
జీవితఫల మిం
కేదిరా?



## ఆశాభంగము

పానకమ్ములో
పుడక నేటికిటు
పడవేసితివో దేవా!

ముద్దు గులాబిని
ముట్టబోవగా
ముల్లు విరిగెనో దేవా!

తీయని పూవుం
దేనె లానబో
తేటి గుట్టెనో దేవా!

గగనమున పతం
గము పైబోవగ
తెగియెను దారము దేవా!

పరిణయసౌఖ్యమును
పాడుజేయు నీ
పంపక మేటికి దేవా? ॥పానక॥



## కాలగతి

సద్రత్నము హారమ్మున వ్రేలక
సంద్రమ్మడుగున నణగునె యకటా?

మేలిపూవు చెలిజడలో నలరక
గాలిని విచ్చుచు తావి వీడునే?

అడవిం గాసిన వెన్నెలయట్టుల
పడతీ! నీయందము వృథయౌనే?

బూదింబోసిన పన్నీరట్టుల
పొలతీ! నీ సరసత వమ్మౌనే?

## కాంచితి! కాంచితి!

కాంచితి కాంచితి భగవంతుని నా
కన్నులార నేడు
కళ్యాణభాగ్య భాసమానయౌ
కాంతరూపమున కన్నుల బడియెన్
పడతీ! పిల్లలు కలరా నీ కని
అడిగితి నే దయతోన్,

పాపులయ్యు పశ్చాత్తాపము బడు
ప్రాణియినీజనులె నాబిడ్డ లనెన్!
మెలతా! జగతిని నీ కెవ్వరైన
మిత్రులు గలరా యంటిన్,
మిత్రు లౌదు రనె ప్రపంచమందు ప
విత్రవర్తనము గలవా రెల్లన్
అతివా! నీ ప్రాణనాథు డెవ డని
యంటి నిలువలేక,

ఆడుదానివలె హృదయము కానుక
యర్పించినతడె నా నాథు డనెన్
కాంచితి కాంచితి భగవంతుని నా
కన్నులార నేడు

## నవ జీవనము

వాడిన పూవున కేటికి మరలను
　　　పరిమళ మొసగెదు దేవా ?

ఎండిపోయినట్టి బావి నూటల
　　　నేటికి నూరించెదు దేవా ?

బ్రద్దలైన సంద్రపుటల నేటికి
　　　పైకి తిరిగి పంపెదు దేవా ?

నేలను పడుచున్న గాలిపడగను
　　　నేటి కెగురగొట్టెదు దేవా ?

పారబోసుకొన్న ప్రణయ పాత్రము
　　　పానీయముతో నింపెదు దేవా ?

ఆశలు వీడిన వానికి మరలను
　　　ఆశలేల గూర్చెదు దేవా ?

ప్రాణమ్ములు చేదైన వానికిని
　　　ప్రాణము తీయగ జేసెదు దేవా ?

అంధకార గర్భ నరక వాసికి
　　　నానంద తేజ మేటికి దేవా ?

　　　　వాడిన పూవున కేటికి మరలను
　　　　పరిమళ మొసగెదు దేవా ?

# వీరుడు

వీరు డెవడురా
శూరు డెవడురా?

ఘోరమైన యుద్ధభూమి
మాఱుమోఁగు ఫిరంగీల
బారులకును వెఱవకుండ
బోరు సైనికుండేనా?

ఉసురుల విసికించి జగతి
మసలకుండఁజేయు క్రూర
వ్యసనమ్ములతోడ బోరి
వశము గొనినవాడు కాఁడా? ॥వీరు॥

శక్తి యెద్దిరా
వ్యక్తి యెద్దిరా?

కొండ లన్ని పిండిగొట్టి
మండు మహాగ్నుల జొరబడి
దండిశక్తి జూపి వెలుగు
గండరగం డగుటేనా?

అన్నమాట నెగ్గింపగ
నెన్ని కట్టడిడుమలైన
వెన్ను జూపకుండ కోరి
కొన్నధీరు డగుట కాదొ? ॥శక్తి॥

రక్తి యెద్దిరా
ముక్తి యెద్దిరా?
పాడుడబ్బు సంచులతో
కూడబెట్టి యనుభవింప
జూడలేక ప్రాణమైన
వీడెడు దురవస్థ యేన?

మనసు గొన్న కన్నియకై
ధనము ప్రాణమైన నిచ్చి
పరిణయపు నిర్వాణమ్మున
తనివి గొనుటగాక నెద్ది? ॥రక్తి॥

వీరు డెవరుడా
శూరు డెవడురా?

# మరణావస్థ

అలలు ఘోరముగ లేచెడు స్వామీ
కలగుచున్నదే మహాసముద్రము!

ఇటు గాంచ మహాప్రళయమ్మే
అటు గాంచ మహాప్రళయమ్మే
ఎటు గాంచుటయును ఈ నా కన్నుల
మటుమాయ గప్పునంతవరకెగా? ॥అలలు॥

జ్వాలలు పైపై లేచెడు దేవా
కాలానలమిదె నోరువిప్పెడిని!

ఈదిశ ఘోరదవానలమే
ఆదిశ ఘోరదవానలమే
ఏదిశ బోవుటమైన నాతనువు
బూదిగాక నున్నంతవరకెగా ॥జ్వాల॥

కూలెడు కూలెడు కొండలు స్వామీ
వ్రాలుచుండె నాతలపై మిన్నులు!

తల పైకెత్తిన నంతమ్మే
తల నిటువంచిన నంతమ్మే

తల నెత్తుటయును దించుటయును నే
నలిగి హతవము గానంతవరకెగా ||కూల||

అలలు ఘోరముగ లేచెడు స్వామీ
కలగుచున్నదే మహాసముద్రము !



## అధోగతి

అమావాస్యరాత్రి నాకాశమ్మునుండి
చంద్రికళతళతళా జారెను భువికి.

మలమల మాడ్చెడు మధ్యాహ్న వేళ
కన్నెరోజా విచ్చి కంపలో బడియె.

కానికాలమ్మున కన్నె చపలతను
బాల కుల్కుచు పాపపంకాన దిగియె.

అరసికులకు కవితాదాన మిచ్చి
కవికోకిలము మృత్యుగహనమ్ము జొచ్చె.

## నిరాశ

కోరి కోరి విసమ్ము గోని దాగవె దేల?
"అదియె నా పాలిటి కమృతమ్మయ్యె."
పోరి పోరి విధితోడ బోరాడె దేల?
"విధియె నన్ బోరికి పిలుచుచున్నాడు."
చెచ్చెర మృత్యువు జేరబో నేల?
"అదియె నా కష్టాల కగును నంతమ్ము."

---

## స్వయంకృతము

ఆకాశముపై చూడ్కి నిగుడ్చుచు
నదేపనిగ యోజింపకు మనసా
ఆకాశమ్మున నేమి గలదు నీ
యనుభవమ్ము తప్పింపగ మనసా?
చల్లని వెన్నెల నుసురుసు రనుచును
సంతాపముపడ దేటికె మనసా?
ఎల్లజగమ్ముల నీ వెన్నెలయే
చల్లదె ప్రేమపరాగము మనసా?

సురనదిమెడ నూగు పద్మపతకము
మురికి చెఱువులో వేతువె మనసా?

సరసముగ బాడుకోకిలకు కాకి
సావాస మెట్లు మేలౌను మనసా?

కమ్మతావులిడు రోజా గండను
గన్నేరుపూవు గుత్తువె మనసా?

అమృతమ్ములో విషము గలుపుకొని
అంత తప్పదాగనేలనే మనసా?



మనస్సాక్షి

పడగ ముడుచుకొను పన్నగమ్మో కడు
భయము గొల్పునో దేవా!

కడలి శాంతముగ నున్నయప్పుడే
కడుభయ మిడునో దేవా!

నిద్దుర దోగెడు సింగపుగురకయె
నీరుజేయు దేహము దేవా!

సద్దేమియు లేని నిశీథమ్మే
సంతాపము హెచ్చించును దేవా!

మృత్యువుతలపే సంతోషలతను
మోడువడగ గొట్టును దేవా!

సత్యదీప్తమా నీ తేజమ్మున
సన్నగిల్లె నాయాశలు దేవా!



## నివృతయాథార్థ్యము

జలబిందువులో భాస్కరుబింబము
తలతల మెఱయుం గాదే దేవా?

నిప్పురవ్వయందున ప్రళయేశ్వరు
నిటలాగ్ని యణగియుండదె దేవా?

ప్రకృతి ప్రేమమంతయు సంజప్రియుల
వలపు కౌగిళుల లేదే దేవా?

నిశ్చలభక్తుల హృదయపీఠముల
నీ వధివసించి వెల్గవె దేవా?

## ఆశాబంధములు

తిరిగితి నెన్నో దేశమ్ముల బడి
దొరకునో చక్కని నెల వంచున్

రాగము లెన్నో హాయిగ బాడితి
రక్తి దేస గల్గునో యంచున్

యెక్కితి నెన్నో పర్వతమ్ములన్
చుక్కల బట్టుదునో యంచున్

వేవిధమ్ములా ప్రేమల సోలితి
ప్రేమాగుట్టు గాంతునో యంచున్

ఇచ్చితి నెందరికో హృదయపుధన
మావిపండు పండునో యంచున్

ఎన్నోపూవుల పూజల సల్పితి
నీశ్వరుకృప గల్గునో యంచున్

# అ కా ల కు సు మ ము లు

ఇప్పుడె తలజూపెద వేటికి ని
న్నెవరు గాంతురో వెఱ్ఱిచందురిడా,
ఎల్లెడ సూర్యుడు వెల్గుచుండ నీ
చల్లదన మ్మెరికి కావలయుఁ ?

కమ్మతావులనః నేటికి నెల్లెడ
జిమ్ముచుంటివే సంపగిపూవా,
ఉమ్మరించు నీ వేళ నెవరు నీ
కమ్మతావు లానందించేరే ?

కుంకుమ పసుపులు మోముపై పూసు
కొందువేల పార్వతివలె సాధ్వీ,
సంకరయువతులు నీ దేదీప్యపు
కుంకుమ తేజము మెచ్చెదరే ?

కూ కూ యని తేనెలొల్క బాడుచు
గుండెలు కరిగించెదేల పికమా,
కాకు లెల్లెడల కావు కావు మన
నీ కలకంఠము వినబడునే ?

## గొంతెమ కోరికలు

కడవలతో ముంచి పారబోయం
గలవె కడలినీళ్లన్నియు నాలీ?

చేతుల దేకుచు హిమాలయాగ్రము
జేరంగలవే కుంటిముదుసలీ?

పైపై వలపులనే, ప్రియా, ప్రణయ
పారావారము దాటంగలవే?

కర్మలచేతనె యీశ్వరురూపము
గాంచంగలవే ఛాందసోత్తమా?



## కనుమూత

క్రోడత్రాచు కనుల కూసమ్ముమూసె
మృగరాజుకన్నుల మూయించె నెండ
ముద్దియ నెమ్మోము మూసె ముసుంగు
కవిచంద్రు మోహాంధకారమ్ము మూసె.

## నా జీ వ న ద ము

అకటా నాజీవనదం బిదియే
మడవుల గుట్టలబడి పారున్?
ఒకచో నేనియు చల్లనినీడల
సుకమగు కౌగిలి యబ్బదయ్యెగా!

ఆడుట గుట్టలతోనే, పాటలు
బాడుట గుట్టలకొరకే, అకటా!
వీడెను జవసత్వములన్నియు నీ
పాడుకొండ రాళ్ళపైన దొర్లన్!

ఇంతేనా? ఇంతేనా? సౌఖ్యం
బీజన్మకు నిక నింతేనా?
సుంతయైన దయ లేదా దేవా?
ఎంతకాల మిటు లోపిక బట్టెద?

అకటా నాజీవనదం బిదియే
మడవుల గుట్టలబడి పాఱున్?

# లజ్జ

మాటలైన తిన్నగ రావే, నను
పాటపాడు మందు వేమి దేవా ?

మేటిగాయకుడవౌ నీకడనే
పాటపాడు టేమిసొంపు దేవా ?

పదములకూర్పె యెఱుగని నే నెటు
పాటల నల్లంగలనో దేవా ?

హృదయ సుమము విచ్చకయే యెటు జి
మ్మెదు భావపరిమళము నో దేవా ?

తల్లిబోవ చిన్నతనముననె వే
తల్లుల పేర్మిను బోర్చిన దేవా ?

పిల్లని చింతాగానము విన నీ
యుల్లము నిజముగ గోరెనె దేవా ?

మాటలైన తిన్నగ రావే నను
పాట బాడుమందు వేమి దేవా ?

## తెలిసీ తెలియని పలుకులు

పదిమందిలోన పాటబాడుమని
బలవంతము జేయకు నాథా!

పదిమందిలోన పాటలు బాడగ
భయము సిగ్గు వేయును దేవా!

పలువుర రంజింపగ నిచ్చకాల
పాటలు రావే నోటికి దేవా

తెలిసీ తెలియని పలుకుల గూర్చిన
వలపు పాటలే వచ్చును దేవా! ॥పది॥

చనువు నీకడం జాల గల్గుటను
వినుపింతు ప్రేమ మెల్లను దేవా!

కనికరించి యొక్కడవె నా ప్రణయ
గానము వినరాలేవా?

పదిమందిలోన పాటబాడుమని
బలవంతము జేయకు నాథా!

# ఇంకెన్నాళ్ళు?

(పాట: యమునా కళ్యాణి)

ఈ విధి నింకెన్నినా
    ళ్ళిలను నేను కష్టపడుట? (పల్లవి)
    కామ్యపదవు లందకయే
    వ్యామోహమ్మున దగులుక నీవిధి॥
    దారేషణచే పరగతి
    దలప కంధకారమ్మున నీవిధి॥
    చేజే స్త్రీకై కూర్చిన
    రోజాపూదండ వాడి
    మోజు సన్నగిల్లిపోయి
    రోజులు చింతతో గడుపు టీవిధి॥



## మానవవాంఛా నిష్ఫలత్వము

ఆకసమ్మున చుక్క లల్లుకొనుచుండె
పక్షులు వినువీధ బర్వుచునుండె

సాయంతనపుగాలి చల్లగా వీచె
బయటను ప్రకృతి సంపదగాంచబోదు
నాటుటమాత్రమే నావంతు సుమ్మ
ఫలము గాంచుట నీదు పనియె వృక్షమ్మ!
మన్మథక్రీడయే మనుజకృత్యమ్మ
పుత్రోద్భవం బౌట పూర్వపుణ్యంబు
కాలమ్మురానిదే కలుగదు సుఖము
కర్మమ్ము తొలగకే కష్టమ్ము పోదు
ఆరటపడినంత యబ్బునే జయము ?
రమ్మన్నవచ్చునే రాత్రి సూర్యుండు ?

## లైలా మజ్నూన్

"లైలనోయీ ప్రియా, కన్నులార గనవె!"
యనుచు పిలచన గొంతుక నానవాలు
బట్టినట్లుగ కనులిట్టె పైకి నెత్తి
చటుకునను మూసి, మజ్నూను సంచలింప
కుండ జపమాలికం దిప్పుచుండ జూచి,

శైలయనురాగపవనసంచాల యూచు
గద్గదక్లాంతి నిట్లను కరుణదోఁప,
"గట్టులను పుట్టలను దాటి కాననముల
గడచి యేళ్లెన్నియో యీది, కట్టకడకు
సన్నిధిం జేర ఫల మిదా కన్నులకును ?

మరచితో గాఢవైరాగ్యపరవశతను
శైల మున్నుండె నీప్రియురా లటంచు ?
లేక ద్రోహాత్మనా నాదు రాకచేత
భగ్నప్రణయంపుగాథ జ్ఞాపకము వచ్చి
పాపినా నన్ను గాంచగా నోపలేవా ?

విధివశత చాపలమ్మునన్, వేరొకనిని
పెండ్లియాడితినేగాని హృదయ మెల్ల
నిండియుంటివి, నీవె నా నిశ్చలంపు
ప్రేమ, సర్వేశ్వరుండును నే మెఱుంగు?

నాథ ! మన్నింపవే దయ నాదు పాప
చయము, నెల్లప్పు డింక నీ చరణదాసి
నౌచు జీవమ్ము గడపెద నాథ, కనవె!

ప్రాణముల మరపించెడు ప్రాణ మిచ్చి
దివ్య దివ్యామృతముకన్న దివ్యమైన

నీదు గానామృతము గ్రోలి, నిన్ను గూడి
నిభృతనికుంజ గృహముల నెల్లకాల
మీ నవోద్యానమున విహరింపనీవె ?"
అనగ, మజ్నూను సూర్యునియట్లు వెలుగు
వదనమున గ్రమ్ము జడల నావలకు ద్రోసి,
కన్నులను విప్పి, లైలను గాంచి, నవ్వి
"లైలవా ? కల్ల ; నీ వెట్లు లైల వౌదు ?
విశ్వమెల్లను దానయై వెలుగు నామె
స్వచ్ఛకాంతిరేఖా సంభిన్నశకలి వేమొ ?
అంతియేగాని లైల వీవన్న సమ్మ
నిదిగో నా లైల నీకు జూపింతు గాంచు"
మంచు లైలాయనుచు గౌగలించి లతల
పూవులను లైలా యంచు ముద్దుగొనుచు
పక్షులను లైలా యంచు పలుకరించి
పలుదిశల లైలా యంచు పరుగు లిడుచు
బోయె మజ్నూను ఆనందపురము జేర.

## ఆ శా కి ర ణ ము

శుభ్రజ్యోత్స్నకు వన్నె గూర్చు నీ
సోయగంబు గనువారే లేరే?
విభ్రాంతి గొల్పునీ దివ్యప్రభ
వీక్షించువారు లేరే కాంతా?
రాల్గరగించెడు నీప్రేమరాగ
మాలించువారె లేరే యింతీ?
కాలము నిరవధి పృథ్వి విపులమా
జాలింబడియెద వేలే బేలా?



## గ గ న కు సు మ ము లు

ఆకాశసుమముల నంద మానంచు
పొలతి యాశాలతల్ బోషింతు వేల?
శ్రీకృష్ణపదదివ్యసీమ శోభిల్లు
పూజాసుమంబుల బూయింపరాదె?
పలురంగులను కన్నులలరించునంచు
నాశాదళమ్ముల గోసెదే లింతి?

శీత విషలవాత శాతాసిహతిని
పలురంగులాకులు నిలువ వోఁబేల ?

బంగారుచెం డ్లటు రంగారునంచు
కాంతౌ ఫలమ్ముల కాసింతె యింతి ?
క్రూరమృత్యువిషోరగోగ్రకీలలను
అమృతఫలమును విషమ్మయి పోవునేమొ !



## ఆ ద ర్శ ము

ఆకసమున చిఱుమబ్బుల చాటున
నడగి దాగుమూఁత లాడె దేలే?

నీ కళ్యాణాకృతి శోభ తెలియ
నిలచి తాండవము సేయవె మూర్తి

చినుకుచినుకులుగ తేనెతుంపురుల
జిలుకుచు చవు లూరించెద వేలే?

ఘనధారాపాతముగ నమృత మా
కాశవాహినీ వర్షింపగదే !

కూనురాగములు దీయు న న్నిటు
కొనిపోయెదవే వింతసీమలకు ?

మానిని, యిచ్చట నొక్కింత నిలిచి
మదిలోనిమాట జెప్పిపోగ దే ?



## జీ వ నా వ

ఎన్ని సంవత్సరముల నెన్నినదంబుల
నీ జీవనావ గడపితి నోరా

కన్నులకు నెత్తు రెగదట్టెను నది
జ్ఞాపకమ్మునకు వచ్చెదు నేనిక !

ఘోరమహా తుపానుమధ్యమున బడి
కొట్టుకొనుచు జీవితాశ వీడుచు

కారుణ్యరాశియౌ పరమేశ్వరు
కరుణ నెట్లొ బ్రతికి బైటబడితిక.

సుడిగుండంబుల జిక్కక బిలబిల
సురసుర దిరుగుచు మునుగుచు దేలుచు

నడియూసగ నెంచి బ్రతుకువెల్లను
గడచి యెట్టులో తప్పి బ్రదికితిగా.

నిర్జనంబులౌ ద్వీపాంతరముల
నెల్లెల్లో చేరి యచ్చటను తి
ర్యగ్జంతువులను బోలి జ్ఞాన మను
నది యేమాత్రము లేక తిరిగితిగా.

మలమాంసమే మృష్టాన్నమ్మటు
మెక్కుచు ఘోరజలంబుల ద్రావుచు
కాలవశుడనై క్రూరభోగినుల
కౌగిళుల జొక్కి విషరుచి గంటిగా.

పడిపడి యిడుముల బడరానిపాట్లు
బడి కలగి తలగి యలజడి వెగ్గలి
కడ కాపరమేశ్వరు నవ్యాజపు
కరుణచేతనే బ్రతికవచ్చితిగా

సాయంకాల మ్మరుణవదనుడై
సముద్రగర్భము జొచ్చెడు సూర్యుని
వేయాఱువిధముల దీనుడనై
వేడికొంటిని నన్నిలు జేర్పుమంచు.

కడకు కంటి నా తపఃఫలమ్ముగ
కరుణాహాసోఽంచితమూర్తిని

కడచి బడసి చింతనామృతమ్మును
కన్నీళ్ళ తీపి నాత్మను దనిపితి

నెన్నిసంద్రముల నెన్నినదంబుల
నీ జీవనావ గడపితి నౌరా!

కన్నులకు నెత్తు రెగదట్టెడు నది
జ్ఞాపకమ్మునకు వచ్చెడి నేనిక!



## వరుసవాని (కల)

సకియ నేను గూడి సరస
సల్లాపము లాడుకొంచు
వాకిట నిలుచునియుండగ
వచ్చె నొక్క బేరగాడు.

సంతసరుకు లమ్మువాని
చెంతజేరి సంతసమున

వింతలెల్ల గాంచుచుండు
నంతలోన నప్పుడటకు ॥సకియ॥

చిన్ననాటి చెలిమితోడి
చెలులు వచ్చి మమ్ము గాంచి
వింతసంతసమ్ము జెలగ
"నింతి, యెవ్వ రీత?" డనిరి.

ముద్దుమోము నెల్లెడ ముసి
ముసినగవులు మొలక లెత్త
"నరరూపము దాల్చి దిగిన
నారాయణమూర్తి" యనియె ॥సకియ॥

"నరరూపము దాల్చి దిగిన
నారాయణమూర్తిగాని
అక్కరో, మీ యిద్దరికిని
యెక్కడిదే చుట్టరికము?"

వదనము వికసించి వెలుగ
బదులుమాట జెప్పకుండ
హృదయమునకు గట్టిగ న
న్నదుముకొనుచు నవ్వెచెలియ ॥సకియ॥

## ప్రే మ ప్ర యా ణ ము

దీపముచుట్టును మిడుతవోలె నే
  తిరుగుచుంటి నో దేవా.

ఏ వగిదిని నా పాపము బాపెదొ
  నీయదె భారము దేవా!

త్రాచుబాముతో సయ్యాటలనే
  సల్పుచుంటి నో దేవా

కాచుటకును నీవుదక్క నెవ్వరు
  కల రిక దిక్కో దేవా!

నీటిబుగ్గపై మహాసముద్రము
  నీదుచుంటి నో దేవా

నీట ముంచినను తేలవేసినను
  నీదే భారము దేవా!

చెలియతోడ నిశి ప్రేమప్రయాణము
  జేయనుంటి నో దేవా

వలపుదీపికలతో మా బాటల
  వెలుగజేయుమో దేవా!

# దేవదత్తము

చిలుకలు కొఱికిన పండొక్కటి నా
చేతుల బడెనో దేవా,
తెలియని నట్లు తీయనిదో విషమో
తినకుండగ నో దేవా?
తోవ బోవుచుండ దండవీడిన
పూ వొకటి దొరికె నో దేవా
తావి కమ్మనిదో తలనొప్పిడునో
యేవిధి తెలియును దేవా?
ఱెక్కలు తెగినట్టి పిట్ట యొక్కటి
అక్కున [1]గొంటిని దేవా
ఎక్కరణిని [2]పెంచి బాగుజేసెదో
[3]నీకే వదలితి దేవా!

---

1 బడెనో 2 పెరిగి పెద్దదానో 3 ఎవ్వరికెఱుకో దేవా!

# కవరు

కవరు వచ్చిందంటె
గంపంత ఆశతో
కాలు విరిగేటట్లు
గప్పుమని గెంతాను.

కాని ఆకవరులో
కంసాలి వ్రాసినా
కంగాళిఫుత్తరం
కళ్ళ జూచేసరికి
పొంగిపోయినమనను
కుంగిపోగా అట్టె
కుర్చీలా సిగ్గేసి
కూలబడి నవ్వాను.

## అవస్థాభేదము

లేమావిగుళ్ల
 మెక్కెడు పికమా
 లేకితిండి నీ
  కేలనే?

పూవుల జాడల
బోయెడు హారిణీ
ముండ్లడొంక బో
 నేటికే?

సురనదిజలముల
తూగెడుహంసీ
మురికి చెఱువు జొరె
 దేలనే?

ఇంగిత మెరిగిన
మనమా నీకీ
యెంగిలి యోజన
 యెట్టిదే?

# శివరాత్రి

పరమశివా యని నోట నిండుగా
పల్కవేమిరా యీ వేళయినా?
కరుణామయు డతడే కష్టమ్ముల
గట్టెక్కించును రా, ఓపాపీ!
పావనగంగాస్నానము జేసుక
పారదోలరా పాపము లన్నియు
నీ విధినైనను పెరిగియున్న నీ
యిహజన్మపాప మేగెడునేమో!
కొండకోనలో నల్లదె శివపూ
జుండు పార్వతిని మది నిలుపుమురా
దండికాంతు లిడు నామెదీపికలు
తలగదోలురా నీ పాపతమము!
కరముల తాళాల్ కాళ్ళను గజ్జెలు
కలిగినాట్యము న్సలుపుమురా
పరవశముగ శివతాండవ మాడుచు
దురితదూరమగా నిద్దుర గనరా!
పరమశివా యని నోటనిండుగా
పల్కవేమిరా యీ వేళయినా?

## * కుతుబ్ మీనార్

ఇది మొగల్ దివాణమా?
　　　ప్రళయశివమహాశ్మశానమా?
ఇది విజయస్తంభమా?
　　　చలవిద్యుచ్ఛంక్రచూడకంభమా?
ఇవి జీర్ణసమాధులా?
　　　ప్రమథగణ నివాసవీథులా!
ఇది యవన వికాసమా?
　　　నటేశ తాండవవిలాసమా!

---

* ఈ గీతాభావము సముద్రగంభీరము. 11 వ నవంబరు తేదీని ప్రపంచములో అన్ని దేశాలలోనూ యుద్ధములో చచ్చినవారిని జయించినవారినీ కూడా స్మరించటానికి సభలు చేస్తారు. ఈ రోజున (**11-11-32**) ఢిల్లీరాజధానిలో ఆంగ్లేయులు విజయకోలాహలం చేస్తున్నారు, ఆబాలగోపాలం రోజంతా. నాగుండె పీక్కుపోయింది. వేదన తగటానికె కుతుబ్ మీనారుకు పోలని. అచ్చటి చిత్రము చూచి వ్రాసిం దీపాట. ఢిల్లీ సామ్రాజ్య మెవరిది? ఇప్పుడు విజయకోలాహలం చేస్తున్న ఆంగ్లేయులదా? కుతుబుమీనార్ విజయ స్తంభము కట్టించిన ముసల్మానులదా? పాండవులకు అశోక పృథ్వీరాజాదులకు వారసులైన ఆర్యులదా? ఒకప్రక్క కుతుబుమీనారు, ప్రక్కన అశోక స్తంభము, ఒకప్రక్క ముసల్మాను మసీదు, ఖిల్లా, ఇంకొకప్రక్క ఆర్యదేవాలయము దూరమా! పాడై రూపుమాసి పోతూవున్న ఈ వృక్షయ దృశ్యాలపైనా పరదేశవాసులైన ఆంగ్లేయుల పరిపాలనా!! భావకవి సమ్రాట్టునైన నాదికాదా యీఢిల్లీ!

* ...............?

నిష్ఠలేని జన్మ కొసగె నిష్ఠసిద్ధి కనకదుర్గ
పాపినైన నాకు పరమపదము జూపె శ్రీరాముడు.
లోకము నను మోసగించె నాకము నన్నీసడించె
ఏకర్మము జేసినాను ఇంత బాధ యేల కలిగె!
ఆంధ్రమాత నన్ను కాన్తు ఆదరించి యున్న యెడల
ఇంతదూర దేశానికి యేల వలస రావలయును?
ఢిల్లీనగరమ్ము కన్నతల్లిలాగ కౌగిలించి
ఉల్లములో చింత దీర్చి ఊపిరి పోసింది నోట
కానివేళ చేరదీసి కడుపునిండ తిండిబెట్టి
కనికరించె నీఢిల్లీకన్న ఆప్తు లెవరు నాకు?

* 19-11-32.

## నా స్థితి

వెన్నెలరాత్రిళ్ళు వేగించలేక
చుక్కల సొబగుల్లు చూడగాలేక,
తలవాల్చి నాస్థితి దలచి కుంగేను,
కుళ్లి కుళ్లి లోన కుమిలి పోయేను!

రాజులలో కవిరాజునా నేను
పాడుగుహలో నేడు పారాడనాయె,
కోకిలలందును పుంస్కోకిలము నేను
గొంతునొక్కుకు మూల కూరుచోనాయె!

అమృతహస్తా, చిల్కు మమృతబిందొకటి
గొంతెండిపోయిన కోయిలనోట!
కొయ్యబారినమేన కోరిక లీన
రిక్క పెట్టవె కాస్త చక్కిలిగింత!

# తాజ్ మహల్

మామిడిచెట్టును అల్లుకొన్నదీ
మాధవీ లతొకటీ
యేమా రెండిటి ప్రేమసంపదా
యింతింతనలేమూ!

చూడలేక పాపిష్టి తుపానూ
ఊడబీకె లతనూ,
మోడయిపోయీ మామిడిచెట్టూ
మొగము వేలవేసీ,
ముచ్చటైన ఆకులు కాయలనే
వెచ్చని కన్నీళ్లోడ్చీ,
పచ్చనాకులా బొమ్మరింటిలో
పండొక్కటి రాల్చీ,
మామిడిచెట్టూ మాధవిలతతో
మాయలో గలసింది
కామితమిచ్చే మామిడిపండూ
కవులకు మిగిలింది!

## ప్ర ణ యాం జ లి

ఇంతయప్పుడె యితరమ్ము నెఱుగనట్టి
విమలమతి నిన్ను ప్రేమించి విఫలమొంది
మరణమునకయి చూచుచు మ్రగ్గుచున్న
స్నేహితుని ప్రణయాంజలిం జేకొను మిదె!

మెఱుపుదీగె మొగిలుతోడ మేలమాడు
నట్లు చిరునవ్వుల న్నన్ను నలరజేసి
ప్రాణములకన్న నీవె నా ప్రాణ మనుచు
మురియుచుండగ నన్నింత మోసగింతె?

ఆసకముదాక బొంగెడు నాస లెన్నొ
వనిత! నీచెంత సఫలమ్ము బడయ నెంచి
మురియుచుండగ నన్నింత మోసగించ
న్యాయమౌనటె చెలియ అన్యాయముగదె!

పోనిలే, అంతదయ నీకు బుట్టకున్న
కర్మమని యెంచి గడపెద కాల మెట్లొ,
ఎంచియో యెంచకో ప్రేమ నించినాను,
బ్రతికినను చచ్చినను నాదు ప్రాణ మీవె!

## జీవ మింక దాల్పనేల?

చెలి కెంపుగ బారుచునో
సెలయేఱా యేమందువె?
"చెలియ నిన్ను మోసగించ
జీవ మేల దాల్తు"వనెదె?

చెలియ మోసగించె, నిజమె
జీవ మింక దాల్పనేల?
కోర్కులన్ని వమ్ములయ్యె
కొనుము ప్రాణముల వేగమె!

వెనుకనుంచి కూకూ యని
పికమ, నన్ను బిలుతు వేల?
"చెలియ నిన్ను వలచె రమ్మ
వలదు విడువ ప్రాణ"మనెదె?

పికమ నీదు మాటల విని
వెఱ్ఱి నౌదు ననుకొంటివె?
ఉవిద నన్ను వలచుభాగ్య
మున్న నింత యేల మునుగు?

పికమ! నా దురంతము చెలి
నీవు లలర జెప్పగదవె,
కరుణమిగిలి యున్ననన్ను
మరువకు మని వేడగదవె!

## కా మి ని

(కల)

మల్లికలారా, యేటికి మీ కీ
యుల్లాసము నా కెఱుగం జెపుడీ,
ఉల్లమ యేటికి నిట్టులు దడ దడ
నూరక కొట్టుకొనంగన్.

అది యేమో నా కనులకు గన్పడు
నతివ యొకో లేక చ్చరయో?
పస దిలకించగ నీ చెలి యప్సర
భామలనుం దలదన్నున్.

వనితసొగసు నా హృదయరాజ్యమును
వశము గొనియె బలవంతముగా, నీ

సతిప్రేమ గాంచుకంటెను మేలౌ
సౌఖ్యము కలదే జగతిన్ ?

ఇంతీ ! నీ వేలోకముదానవొ
యెరుగ నోకించుక యైననుగానీ,
నిన్ను గన్న నిముసమందె నా మది
నీయందే తగిలెన్.

పున్నమచందురు సాక్షిగ నిపుడో
పొలతీ నను చేపట్టంగదవే,
నిన్నే వలచితి నిజము నమ్ము మో
కన్నెరో నామాటల్.

మిన్నున చుక్కలు మినుకుమినుకు మని
మివులన్ కులుకుచు చోద్యము జూచెడు
కనుమా, పూదావుల గొని చల్లని
గాలి వీచు మది యలరన్.

చందమామ యీ ప్రేమబ్బు జొలు
చందము నూఅక చూచెద వేలే ?
అందకత్తెరో అటు జూడకుమీ
ఆలకించు నా పలుకుల్.

తెలియనిబాసల నడ్డు జెప్పెదవు
నిలువం గలదే ప్రాణము చెలియా ?

మాటలతో జాగేల చేసెదే
మంచిది ముద్దొకటీవే.
ఆహాహా! యీ ముద్దు తీపి కల
యమృతమైనను సరియౌనే,
సకియా, యిన్నాళ్లకు నాజన్మము
సార్థక మయ్యెంగాదె!
అది యేమే, ఒక ముద్దుతోడనే
అంతమొందెనే మనవెయ్యము చెలి?
దయమాలి యెచటి కొంటిగ ననువిడి
దాటి పోయినావే?

చందమామ యీ నల్లమబ్బుజారు
సందున నెచటికి మాయమైతివే?
సుందరి, నిమసము మెఱపు మెఱసి కను
లందు దుమ్మునిడి పోతే!

అని యేమే నాజనకురూపు గాని
యడలించె దొడలు నీరై పోవగ
ముదిత వింత దుష్టచరిత వెవతెవె?
మోహినివా? అల కామినివా?

## నాట్యసుందరి



ఆడవె, ఆడవె
అన్నులమిన్నా
ఆడవె లేనడు
మల్లలనాడఁ
ఆడెడు నీనడుమందము గాంచిన
నల్లాడవె ప్రేమను లోకంబుల్ ? ॥ఆడవె॥

పాడవె, పాడవె
భామామణిరో,
పాటలాధరము
బాగులు గుల్కఁగ
వలపు జిల్కు నీ పాటల విన్నన్
పరవశ గాదే ప్రకృతి యెల్లఁ ? ॥పాడవె॥

చూడవె, చూడవె,
సుందరవదనా !
సోగకన్నులఁ
సోలగ ప్రేమము
సొంపు గుల్కు నిఁ జూచినంతనే
చుక్కలు సైతము సోలవె ప్రేమఁ ? ॥చూడవె॥

## ప్రేమతత్త్వము

ఎద మెత్త నౌటకై
సొదగుందరా అంత
మది గల యహమ్మంత
వదలిపోవునురా ॥ఎద॥

వల పెఱుంగక బ్రతికి
కులికి మురిసేకన్న
వలచి విఫలమ్మైంది
విలపింప మేలురా ॥ఎద॥

చెలివలపు లేని సీ
కలిమి కాల్పనె వినుము
వలపు దీగనె జీవ
ఫలము కాయునురా ॥ఎద॥

ప్రేమకన్నను యెక్కు
వేముందిరా యెల్ల
కామ్య పదవులకన్న
ప్రేమె యెక్కువరా ॥ఎద॥

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
యేమింక వలయురా ॥ఎద॥

## కో కి ల

ఈ మావిపై నుండి
ఈవు కూ కూ యంచు
నామావి పైనుండి
ఆపె కూ కూ యంచు
నేమి బాసల జేతురే,
కోకిలా,
యేమి బాసల జేతురే!

ప్రకృతిజన్యంబులై
పరమరమ్యంబులౌ
భావముల నొండొరుల

ప్రియ మొల్కొడు నట్లు
పల్కరించుచు నుంటిరే,
కోకిలా,
పల్కరించుచు నుంటిరే?

మనుజుల కగమ్యమై
మహితశక్తిం గల్గి
పరమామృతము లొల్క
ప్రియవాక్కుల మీరు
బాస లాడుచు నుంటిరే,
కోకిలా,
బాసలాడుచు నుంటిరే?

పరులు విన్నను మీదు
పరువు పోవు నటంచు
పాడు లోకము జూచి
భయమె లేకను వలపు
పలుకు లాడగ జెల్లునే,
కోకిలా,
పలుకు లాడగ జెల్లునే?

పరమ ప్రేమస్వరూ
పంబులై లోకాల

పావనంబుల జేయు
పరిణయకవులౌ మీకు
పరు లనేవా రుందురే,
కోకిలా,
పరు లనేవా రుందురే?

చెలియయును నీవలెనె
చివురుటాకుల మెక్కి
చెవులపండువు గాగ
చిలుకంగ గానమ్ము
చింత నీ కేమున్నదే,
కోకిలా,
చింత నీ కేమున్నదే?

చెంత గూర్చుని మోము
చెలువు గుల్కగ వలపు
దెలుపుచుం బలుకంగ
చెలి చెంత లేని నా
చింత లెన్నడు తీరునే,
కోకిలా,
చింత లెన్నడు తీరునే?

పాడవే, కోకిలా,
పాడవే, యింపుగా
ప్రాణముల్ హాయిచే
పరవశ మొందగా
పాట పాడవె తీయగా
కోకిలా,
పాట పాడవె తీయగా

## చందమామ

తెల్లమబ్బుగుఱ్ఱము నెక్కి తేజరిల్లి
స్వారిజేయుచు బోవు నో చందమామ!
యేల నీ కంతగర్వము? ఎల్లకాల
మొక్కతీరుగ సంపద లుండునోయి?

పండువెన్నెల జగ మెల్ల బర్వజేసి
అందరిమనంబులన్ గొని హాయి ముంచి,
ఎల్లలోకాలకును రాజు నేనె యంచు
కులుకుచుందువుగా వెఱ్ఱిగొల్లవోలె.

కష్టసుఖ మెఱుగని నసికందుబిడ్డ
చందమున గంతు లేసెదు చందమామ!
కాలపరిపాకమున నీకు గల్గబోవు
గతి దలంపుము నిశ్చలమతిని సుంత!

అంధకార మలీమసం బౌచు జగతి
ప్రళయకాలమహాబ్ధి నిర్మగ్నయట్ల
చూడ దుర్భేద్య మానప్పు డేడ బోవు
నీదు రాచఠీకంబు వెన్నెలయు చంద్ర!

కష్టభాగ్యుడనౌ నన్ను గాంచి మంద
హాసమున పరిహసించెద వౌర, చెలియ
చెంత లేదనియేన? నీ వింత యొడలు
మరిచి న న్నిట్లు మతిమాలి పరిహసింతు?

పలవ! పోపొమ్ము నీతోడ వాదు లేల?
చలువతిన్నియపై ముద్దుచెలియ మోము
మోహపారవశ్యంబున ముద్దు గొంచు
బుద్ధి జెప్పింతు పొమ్ము నీ పొగరడంగ.

# కోయిల

కూ యనుచు దీనముగ గూయు కోకిలమ్మ!
చింత నీ కేలనే? యెంతో సంతసమున
సరసపల్లవభాగ్యవసంతమందు
గున్నమావులపై నెక్కి కోర్కి దీర
లేజివుళ్లను మెక్కుచు, లేతమనసు
గలపులుగ వాట రాగంబు నిలుపలేక
హాయిచే సోల లోకంబు కూ యటంచు
కూయుదువు గాదె నెమ్మది కోర్కు లూర!

పరమసంతోషయుత గానపారవశ్య
కలన నొడ లెఱుంగకను జగంబు మరచి
విస్ఫుటంబుగ బాడు నీ విమలగీతి
నేడిటుల నింత దీనమా నేమి చెపుమ?

వెఱ్ఱిలోకంపు గోలను వెక్కిరింప
మావి కడగొమ్మ గూర్చుని మధురఫణితి
మనసు కరుగంగ 'నేల నో మనుజులార
పోరు?' లని ప్రేమతత్వంబు బోధసేతె?

వెన్నెలల చంద్రు డల్లెడ విరియజల్లి
వలపుకలిమిని మోమెల్ల చెలువుగుల్క

మోహమున మొగిలుకన్నియ మోము ముద్దు
గొనెడుచందము గాంచుమా కోకిలమ్మ !

అందరును సంతసమ్మున నలరువేళ
తాళవృక్షంపుటాకుల దాగి యేల
కో యనుచు విలపించెదు కోకిలంబ !
చెలియ నెడబాసినావె వెన్నెలలవేళ ?

ఇల గల వియోగులందున నేనె కష్ట
భాగ్యుడ నటంచు లోలోన వగచుచుండ,
జత కుదిరినావె నావలె వెతల గుంద
దుర్దశల వింతస్నేహితుల్ దొరుకుదురుగ !

చెలియ నెడబాసి నెమ్మది చింత గుందు
నేను పాల్గొనగల జుమీ నీదువెతల
కష్టముల చవిజూచినగాని పరుల
వెతల గాంచి కన్నీళ్ళను విడువగలమె ?

మధురఫణితి కూ కూ యని మనసు కరుగ
సొదల జెప్పుచు చింతల సోలజేయు
గలవు నీ దీనమృదుగానకలన నదియె
నేరకుండిన వగతుమే నీదుగతికి ?

అకట! నీ గానమహిమ నాకబ్బెనేని
మాటలం జెప్పగారాక మదిని పొంగి
పొరలెడు వియోగదుఃఖంపుతరగ లేచి
జగతి చింతల ముంపగా జాలదొకో?

---

బిచ్చగాడు

త్రోవ గాన్పింపకున్నదో దేవ! కనులు
మసక గ్రమ్మెడు, నెమ్మది మాంద్యతమము
గప్పుచున్నది, యింకెంత కాల మిట్టు
లంధకారము లోకమ్ము నావరించు?

ద్గించినట్టి మో మెత్తక, దేహి యంచు
చేతులం జోలె గట్టుక, జీర్ణవస్త్ర
ములను దాలిచి ప్రణయభాగ్యలను బిచ్చ
మడుగ నొకరైన నొకపట్టె డిడరు దేవ!

జగతి ధర్మము శూన్యమై చచ్చెనొక్కొ!
లేక నాకర్మఫల మొకో, ఈ కరణిని
ఆకలి దహింప కరుణ నమ్మా యటన్న
పలుకువారలు లేక చావంగనుంట?

అన్నియాసలు వ్యర్థమ్ములయ్యె తండ్రి!
నీవుదక్క నా కింక దిక్కెవరు లేరు,
నీదయారమ్యరూపము నింక మరుగు
పరుపబోకుము భక్తుని కరుణ గనుము.

పాటకుడు

వీణె చేజారి పడిపోవు, వేళ్లు శ్రుతుల
నింపుగా మీటి రాగ మొప్పింపకుండె,
గొంతు బొంగురు వోయెడు, నెంత చించు
కొంచు బాడిన నీవు గాన్పించవేమి?
హాయిలో మున్గి మాయమై పోయినావా?
పరవశత జెంది భక్తుని మరచినావా?
దేవ, నా కింక నెపుడు నీదివ్యదర్శ
నమ్ము నిచ్చెదు? నాపాట కంత మెపుడు?

# వి ర హి ణి

దీపకళికలు విన్ననై తెల్లవారె
పాన్పుపై నిడ్డపూవులు వాడిపోయె
పిట్ట లన్నియు తమ గూళ్లు వీడి పరచు
స్వామి, నీదాసికడ కింక వచ్చుటేమి?
కనులు మూతలువడి నిద్ర గమ్ముచుండె
బడలికంజేసి అవశగ నొడలు తూలు
పరవశగ జూచి నాసిగ్గు తెరను జీల్చి
చోరువలె పట్టుపడకుండ పారిపోవు
నప్పుడైనను దయయుంచి యంతరంగ
మందు నాప్రేమ మన్నించి, మరచిపోక
లేపి, నీముద్దుమోమును జూపి వేగ
నామనోలోలతను బాపు నాథ! దేవ!

# ప్రోషిత

ఎవరు సంతోషింప నీ యలంకారంబు ?
ఎవరు గని మెచ్చుకొన నీ సొమ్ము లెల్ల ?
పరివిమలాత్మక! దేవ! ప్రాణేశ! నీవుగా ||కెవరు||

నిదుర బట్టక వేళ నీమనోహరరూప
మెద నిల్పి నా జీవితేశ్వరుడ వీవె యని
పదిలముగ నిన్ను నే బట్టుకొని కౌగిలిడి
మది పొంగి కను విప్ప మాయమైపోతి విం ||కెవరు||

బాలసూర్యుని కాంతి గేలి సేయగజాలు
ఫాలమున తేజస్సు పరిభవిల్లుచుండగా
లీల లొప్పెడుమూర్తి దాల్చి నా దగుమనో
లోలత్వమున్ బాప జాలిగొని రావైతి

వెవరు సంతోషింప నీయలంకారంబు ?
ఎవరు గని మెచ్చుకొన నీసొమ్ము లెల్ల ?
పరివిమలాత్మక! దేవ! ప్రాణేశ! నీవుగా
కెవరు సంతోషింప నీయలంకారంబు ?

## ప్రణయగీతము

జలజల మని పాఱు సెలయేటిచెంత
నిభృతనికుంజంపు నిశ్శబ్దమందు
పాలఱా పానుపుపై బవ్వళించి,
పూవులదావికి పొంగుచు మదిని,
పిట్టల పాటల వీనుల వించు,
పండువెన్నెల మేను పరవశ మొంది,
పతి కౌగిలింపగ భయపడి తగ్గి
సొక్కి సోలెడు నిండుచూలాలివోలె
చక్కనిచందురుసరసకు బోక
నొంటరిగా బోవు నొక మొగిలుకన్నె
మో మద్దమందు నాముద్దులచెలియ
వన్నెల చిన్నెల వదనమ్ము గాంచి
వలపు ముచ్చట లేవొ తలపున రాగ
హృదయమ్మునం దెల్ల వింతరాగమ్ము
పరమాత్మశక్తి నా ప్రబలి లోగొనగ,
చెంత నిలచుచు మిన్ను జీల్చుకుపోవు
నడవి మల్లియచెట్టుకడ కేగి, మేలి

పూ వొండు గొని దాని బూరగా జేసి,
ప్రణయవాయువులతో బాగ పూరించి,
రాగబలమున వ్రేళ్ళు వేగ నాడంగ
నాప్రాణసఖి నెమ్మనమ్మున నిల్పి
వలపుసంపదలె శాశ్వత మనినమ్మి
వాయించినా నొక్క ప్రణయగీతమ్ము
విరహిణీజనమర్మ మెరిగిన మలయ
పవనుండు నే బాడు ప్రణయగీతంబు
నుద్యానవనసీమ నొంటరిగాను,
చల్లని వెన్నెల యెల్లెడ గాయ,
నెత్తమ్మిపూవుల మెత్తనిపాన్పు
పయి మేను జేరిచి, పరవశ మొంది
కలలోన కాంతుని కౌగిలి జొక్క,
కరగు నా ముద్దులకన్నె వీనులను
చల్లని నా పాట మెల్లగా నూదు,
ప్రణయకవయిత్రి నా బాలయే యెఱుగు
నా భావగీతికి నన్వయం బెల్ల
ప్రేమకోకిల నాదు లేమయే మెచ్చు
నవ్యమాధుర్యమౌ నా గానరసము.

# ఊ రే గిం పు

( దాసుమరణమును గూర్చినది )

ఊరేగు * మన్మధా ఊరేగవోయ్
పెండ్లికొడుకూలాగు పల్లకీలో యెక్కి ॥ఊరేగు॥
వాసంతికాదేవి వన్నె తరిగున్నాది
కీర్తికాంతల్లదిగో కీగన్ను గీటేని ॥ఊరేగు॥
కిన్నరులు ఖేచరులు కింపురుషు లంతాను
బాజాను వాయిస్తు పల్లకితో వచ్చేరు ॥ఊరేగు॥
వేదాంతివి నీకు లేదూ రేపటిచింత
నేడే శుభలగ్నమ్ము వేడుక చూడొచ్చినాము
ఊరేగు మన్మధా ఊరేగవోయ్
పెళ్ళికొడుకూలాగు పల్లకీలో యెక్కి॥

* (చిత్తరంజను డన్నను మన్మధు డన్నను ఇంచుమించొకటే)

## భక్తిమార్గము

వొద్దే యీ వేదాంతమూ
వొద్దూ వొద్దంటే వినవే॥ వొద్దే॥
ఉన్నదేమో వున్నేవున్నది
లేనిదేమో లేనేలేదు
ఉన్నదీ పొమ్మన్నా పోదూ
లేనిదీ రమ్మన్నా రాదూ॥ వొద్దే॥
చూడదగినా క్షేత్రా లున్నవి
ఆడదగినా తీర్థా లున్నవి
పాడదగినా పాటా లున్నవి
వేడదగినా దేవుళ్లున్నా॥ వొద్దే॥
జీవితము శాశ్వతము కాదూ
భావరాజ్యము కంతూలేదూ
యేవిధానా తుద నెగ్గేమో
దేవుడూ నిర్మొహమాటంటా
వొద్దే యీ వేదాంతమూ
వొద్దూ వొద్దంటే వినవె!

:

## "చాకలోళ్ల గొప్ప"

ఎల్లా గెక్కూవా, ఇం
కెల్లా గెక్కూవా?

సదువూకున్నా బ్యామ్మర్లంతా
సాకలవోళ్ళా రాముడికంటే?
ఎల్లా గెక్కావా?

పండాగనకా పబ్బామనకా
వండనిబువ్వా వడకనిబట్టా
సక్కదనాలా సాకలపుల్లీ
కెక్కడమడితే అక్కడ దొరుకు
ద్దెల్లా గెక్కూవా?

పిల్లాపెళ్ళి చేసిన్నాడూ
పెద్దాకాపూ డబ్బాలిత్తే
కల్లూనీలూ తాగినన్ని
కొల్లాగానూ దొరుకూతాయీ
ఎల్లా గెక్కూవా?

చలవామడతా మోఁకూ గట్టీ
జలతార్ రుమ్మాల్ తలకూ జుట్టీ

యీాదులయెంబడి వూరేగింపుతో
ఇలాయి లట్టే రాముడికంటే
ఎల్లా గెక్కూవా ?

జగతీలోపల కులాల్లోకీ
సాకలవోళ్లా కులమే గొప్పా,
సాకలవోళ్లా కులానికల్లా
సక్కనిపుల్లీ రాముడె గొప్ప
ఎల్లా గెక్కూవా, ఇం
కెల్లా గెక్కూవా ?



మజా !

ఎల్లొద్దామా పుల్లీ ఎల్లొద్దామా
కల్లుదుకానాని కెల్లొద్దామా పుల్లీ॥
కల్లూ తాగినోళ్లు
కైలాస మెల్తారంట
సారా తాగినోళ్లు
సర్గ మెల్తారంట!   ॥ఎల్లొద్దామా॥

కడుపూ సందరమైతే
కాలవ సారామైతే
పడుతూ లేత్తూ తాగి
బాగా కైపెక్కాలి
ఎల్లొద్దామా పుల్లీ ఎల్లొద్దామా
కల్లుదుకానాని కెల్లొద్దామా!

## వెఱ్ఱిపిల్ల

గుత్తొంకాయ్ కూరోయ్ బావా!
కోరి వండినానోయ్ బావా!
కూరలోపలా నా వలపంతా
కూరిపెట్టినానోయ్ బావా!
కోరికతో తినవోయ్ బావా

తియ్యని పాయస మోయ్ బావా
తీరుగ వండానోయ్ బావా
పాయసమ్ములో నా ప్రేమనిమేటి
పాలుబోసినానోయ్ బావా!
బాగని మెచ్చాలోయ్ బావా!

కమ్మని పూరీలోయ్ బావా
కర కర వేచానోయ్ బావా
కర కర వేగిన పూరీలతో నా
కాంక్ష వేపినానోయ్ బావా!
కనికరించి తినవోయ్ బావా!

వెన్నెల యిదుగోనోయ్ బావా
కన్నుల కింపౌనోయ్ బావా
వెన్నెలలో నా కన్నె వలపనే
వెన్న గలిపినానోయ్ బావా!
వేగముగా రావోయ్ బావా!

పువ్వుల సెజ్జదిగో మల్లే
పువ్వులు బరిచిందోయ్ బావా!
పువ్వులలో నా యవ్వనమంతా
పొదిపిపెట్టినానోయ్ బావా!
పదవోయ్ పవళింతాం బావా!

* హితోపదేశము

చాటొద్దా నీకు మాటొద్దా ?
చిన్నదానవు నీకు సిగ్గొద్దా ?
ఆసీమ యీసీమ
అంద రందాలు
దిద్దంగ బిళ్లేరి
అద్దమౌతావా ? ||చాటొద్దా||
ముందు మన పాపణ్ణి
కింద దిగనీక
ఎత్తుకొని నలుగురూ
వొత్తిపారెయరా ||చాటొద్దా||
చిట్టి నువ్వు దేవతై
చేసేటి దేమే ?
రచ్చకె కొట్టినే
రద్ది పడతావా ?
చాటొద్దా నీకు మాటొద్దా ?
చిన్నదానవు నీకు సిగ్గొద్దా ?

* With apologies to Mr. Nanduri Subba Rao.

## గోపికా గీతలు

### 1

నీపై మోహము నోకృష్ణా
నిలుపగ లేనోయీ కృష్ణా!
ముద్దుమోము గాంచక కృష్ణా
మోహ మాపలేరా కృష్ణా!

చిన్నదాన నీకై కృష్ణా
చింతల జిక్కితిరా కృష్ణా!
నీసిగలో దాకటి కృష్ణా
నెమలికన్ను నీరా కృష్ణా!

నిన్ను జూడకుండక కృష్ణా
నిముస మాగలేరా కృష్ణా!
పతి గలదాననురా కృష్ణా
పదెపదె తిప్పకురా కృష్ణా!

బతిమాలుదు నోయీ కృష్ణా
బాధపెట్టకోయీ కృష్ణా!
అబలను పాణిము లో కృష్ణా
అర్పించితి నీకో కృష్ణా!

బ్రతికింపను చంపగ కృష్ణా
భారము నీదేరా కృష్ణా!
నీపై మోహము నో కృష్ణా
నిలుపగలేనోయీ కృష్ణా!

## గో పి కా గీ త లు

### 2

చిలిపి చేష్టలు జేయ[1]
చెట్టునకు గట్టిరా[2]
చిన్ని నాముద్దు కృష్ణా
నిన్నో
చిన్ని నాముద్దుకృష్ణా
శ్రీకృష్ణ నిను నన్ను
జేర్చి[3] చెట్టున గట్ట
చిలిపి చేష్టల జేతురా
యెన్నో
చిలిపిచేష్టల జేతురా!

---

1. జేస్తె 2. చెట్టుకూ గట్టార 3. చెట్టుకు గడితె

[1] చిలిపిచేష్టల జేయ
[2] చెట్టునకు గట్టిరా
చిన్ని నాముద్దు కృష్ణా
నిన్నో
చిన్ని నాముద్దుకృష్ణా!

## గోపికా గీతలు

### 3

తలుపు తీయునంతలోనె
తత్తర మది యేల నోయి?
తలుపు దీతు వీలు జూచి
తాళుము కృష్ణా!
కొంత సేపు
తాళుము కృష్ణా!
పతి నిద్దుర వోవలేదు
మతి సందియ మొందె నేమొ,

1. చిలిపిచేష్టలుజేస్తె 2. చెట్టుకూ గట్టార.

పతికి కునుకు పట్టగ లో
పలుకు వత్తుగాని తాళు
తాళుము కృష్ణా
కాస్తసేపు
తాళుము కృష్ణా!

నుదుట బొట్టు దిద్దలేదు
చెదరియున్న ముంగురులను
కుదురుజేయలేదు యేల
పదె పదె పిలచెదవురా
తాళుము కృష్ణా
కాస్తసేపు
తాళుము కృష్ణా

ఏల నంత తత్తరమ్ము
ఏల నంత భయము, సామి?
నిన్నుగాక వేరొకని
నెట్లు వలవగలను కృష్ణ!
తాళుము కృష్ణా
కాస్తసేపు
తాళుము కృష్ణా!

# రాధికా గీతము

నా మోహపూర్ణ తృష్ణ
నా నోములఫలమ్ము
నా నాథు డేల రాడే?
అయ్యయో
నను వీడిపోయినాడే!

నా జీవితేశుండు
నాదు వలపుల తేడు
నా కృష్ణు డేల రాడే?
అయ్యయో
నను మరచిపోయినాడే!

చిన్నతనమునునుండి
తన్నె ప్రేమించినా
కన్నెప్రేమము మరచెనే
అయ్యయో
నన్ను మరచిపోయెనే!

చిరినవ్వు మోముతో
చెలువొందు నా సామి

శ్రీకృష్ణు డేలరాడే
అయ్యయో
చింతలను ముంచినాడే!

నిండుచందురు బోలు
నెమ్మోము గలవాడు
నా సామి తావచ్చునే?
చెలియరో!
నాకోర్కె లీడేర్చునే?

నెమలి పించములతో
కొమ రొప్పుమౌళి గల
సుందరాంగుడు వచ్చునే?
చెలియరో
అందమును జూపించునే?

పాలు దీయుచునుండ
పైనబడి బలిమిమై
పాల నన్నియు ద్రావునే
ఊకున్న
పసిబాలువలె పోరునే.

పని జేసిచేసిట్టె
కునికినంతనె చేరి

కనులు రెండును మూయునే
యెవరంచు
నను పరవశం జేయునే.

వనములో తా నుంట
తన రాధకుం దెల్ప
వేణుగానము సేయునే
హాయిగా
ప్రాణ ముప్పొంగించునే!

నను జేరి సాదరింద్ల
తనువు పులకలు జెంద
రాధ కౌగిట దేల్చునే
నా సామి
రాధచింతల జేల్చునే!

సోగ కన్నుల ప్రేమ
రాగ మొలుకంగ నీ
లోకమును మరపించునే
నామనో
లోలత్వముం బాపునే!

ఆనందమయమైన
యీ ప్రేమరాజ్యమ్ము

రాధ రాణిగ నేలునే
చెలియరో!
రాధపున్నెము పండునే!



## దొంగ కృష్ణుడు

(రాధికాగీతము)

నల్లవాడే
గొల్ల
పిల్లవాడే
చెలియ
కల్లగాదే వాని
వల్లొ జిక్కితినే నల్ల॥

వచ్చినాడే
తోట
జొచ్చినాడే
సకియ
చొచ్చి నాదా మనసు
ముచ్చిలించాడే నల్ల॥

ఆగినాడే
పొంకల
దాగినాడే
మనసు
రాగబంధము వేసి
లాగుకొన్నాడే నల్ల॥
చూచినాడే
మోము
దాచినాడే
నాడు
దాచుకొన్నావలపు
దోచుకొన్నాడే నల్ల॥
చేరినాడే
చెంత
చీరినాడే
చేర
కోరి చేరా బోవ
పారిపోయాడే నల్ల॥
పాడినాడే
చనుచు

ఆడినాడే
మదిని
చేడె! ఆతనిపాట
వీడకున్నాడే! నల్ల॥

ఊదినాడే
మురళి
చేదినాడే
వలపు
నాదుమది తన రూపు
పాదుకొలిపాడే నల్ల॥

చూడలేనే
మమత
వీడలేనే
వాని
జోడుకూడని ఉసురు
వీడిపోనీవే నల్ల॥

## వ ట ప త్ర శా యి

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా
జంటగా నను బిల్వదగదోయీ ?
కంటికంతా జలమయంబై
మింటివరకును నేకరాశై
జంట దొరుకని మహాప్రళయపు
టింటిలో వటపత్రడోలిక
నొంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా
జంటగా నను బిల్వదగదోయీ ?
జగము లన్నియు కాలయోనిని
మొగము తెలుగక నిద్రబోవగ
నగుమొగము గల ముద్దుబాలుడ
వగుచు జోలల బాడుకొంచూ
నొంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా
జంటగా నను బిల్వదగదోయీ ?

## త్రోవే లేదా ?

రావాలంటే త్రోవే లేదా
దేవదేవుడౌ నానాథునకు ?

తారలు జూపెడు దారు లెరుగడే
భూరమణుండౌ నా ప్రాణేశుడు ?

పూవులజాడల బడి రాలేడే
భువనమోహనుడు నా రాజేంద్రుడు ?

రాగిణి ప్రణయపురవళిని వినడే
రాగలోలుడౌ నా లోకేశుడు ?

ప్రేమద్వారము బెట్లు సడిల్చి
నామనోహరుడు రాజాలడటే

రావాలంటే త్రోవే లేదా
దేవదేవుడౌ నానాథునకు ?

## కొ్రత్తవింతలు

"ఈ తమ్మలపు్రముద్రి లేదవే చెలియ ?"
నిద్రిలో ప్రియుడు నన్ను ముద్దాడె నేమొ.
"ఈ మేనిగంధంబు యేడదే చెలియ ?"
భువనమోహనమూర్తి పూసినాడేమొ.
"మగువ! నేడీ కంఠమాధుర్య మేమొ ?"
నా మోహనుడు నింపెనేమొ ప్రేమముతో.
"కాంత! నీ కీ దివ్యకాంతి యెక్కడిదే ?"
నా దేవదేవుండు నన్ను మెచ్చెనేమొ.



## మురళీకృష్ణుడు

హృదయములు రెండు ప్రేమచే నేకమైన
లీల శృతిలోన వేణువు లీనమయ్యె
విశ్వ మెల్లను నిండిన ప్రేమరాగ
మట్లు నీరాగ మెల్లర నావహించె.

ఒక్కపరి కోకిల మ్మటు లొక్కసారి
గరుడ గంధర్వ కిన్నరీ గానఫణితి
బాలపవనుడు పూల నుయ్యాల లూపు
నట్లు నీపాట మము నూపె, నౌర, కృష్ణ!

పవనుకౌగిలి జొచ్చిన పల్లవమ్ము
లట్టులను నాలిచింతల నన్ని మరచి
భవ దమృత వేణుగానాతి పారవశ్య
మున నచేతను లటు లైతిమోయి కృష్ణ!

---

## తగనా?

దాసిగా నుంటకైన
తగనా ప్రాణేశ, దేవ? దాసిగా॥

పాదమ్ములు నొచ్చినంత
పట్టుటకై నను దగనా? దాసిగా॥

తలపై నీపాదధూళి
దాల్చుటకై నను దగనా? దాసిగా॥

వదనమ్మును గాంచి భక్తి
పరిణమిల్లుటకుం దగనా ? దాసిగా॥

నిన్ను జూచి మదిని ప్రేమ
నిలుపుటకైనను దగనా ? దాసిగా॥

నా నాథుడ వీవె యనుచు
నమ్ముటకైనను దగనా ? దాసిగా॥

ఒరు లెవ్వరు జూడకుండ
నొక్క ముద్దుగొన దగనా దాసిగా॥

పరవశమున నీప్రేమము
పాడుటకైనను దగనా
దాసిగా నుంటకైన
తగనా ప్రాణేశ, దేవ ?



గుర్తులు

"అతడే నా నాథు డంచు
అతివ! యె ట్లెఱింగితివే ?"

"ఎందరిలో నున్నను తా
నీ మోమే గాంచుచుండు

సుందరాంగు లెంద రున్న
చూడ డించు కేని వారి
నతడే నీ నాథు డంచు
నతివ! నే నెఱింగితినే!"

"అంతమాత్ర నెట్టు లందు
వతడే నా నాథుడంచు ?"

"చెలియ! నిన్న నీవు ముద్దు
చేతులతో గూర్చినట్టి
కలువపూలదండ యతని
కంఠసీమ నలర గంటి
నతడే నీ నాథు డంచు
నతివ! తెలియ జాలనటే ?

పాడు సిగ్గు

దేవా! నాకనులముందు
తేజరిల్లు మెప్పటట్లు దేవ! నా॥

పరిణయపూర్ణహృదయుడ వై
భాసమాన దేహుడవై

భానవీథి నన్ను గోరి
వచ్చిన నిను గాంచనైతి  దేవ! నా॥

వెల్లివిరియు తేజముతో
వెల్లమబ్బు నంచు వీడి
మెల్లన దిగివచ్చు నిన్ను
మేల్కొనియుం జూడనైతి  దేవ! నా॥

వలపున నాయిల్లు జేరి
తలుపు మెల్ల తట్టు నీదు
పిలుపు వినియు, ని న్నెఱిగియు
వలపు నిలుపజాలనైతి  దేవ! నా॥

పాడుసిగ్గు వీడదాయె
ప్రాణేశా! దేవా! నీ
చూడచక్కనైన మోము
చూడలేక వెఱగువడితి  దేవ! నా॥

జీవితంపుమేలి ఫలము
చేత జిక్కి జారిపోయె
మండిపోవెడారిలోన
నెండమావి యట్లు దోచె  దేవ! నా॥

అస్తమిత దినేశంబై
అంధకార బంధురమా

మిన్నుపై హొరాత్తుగాను
మెఱుపు మెఱసినట్టులయ్యె దేవ! నా॥

వలపునిండి వచ్చిన నీ
వాంఛ దీర్ప నైతి నంచు
మెలవేసుకపోవు హృదయ
మెట్లు బ్రతుకుదాన నింక

పరిణయపూర్ణహృదయుడవై
భాసమాన దేహుడవై
దేవ! నాకనులయెదుట
తేజరిల్లు మెప్పటట్లు.

రా గి ణి

చూడ జూడ నీరూపము
సుందరమై యొప్పుదేవ!
సొక్కిసొక్కి నీవలపున
సోలి పరవశత గందును!
వినగ వినగ నీ నామము
వీనులవిం దాను నాధ!

చనగ చనగ నీ జాడల
సౌఖ్యము మునుముందె తోచు
తలప తలప నీ లీలలు
తనువు పులకరించు స్వామి!
వలచి వలచి దేవ నిన్నె
వంత లెల్ల మరచిపోతి!



## ముసిడిపండు

మరకత మాణిక్య మనుచు
మనసుపడితి గాదె మనమ ?
కైవసమయినంతనె యది
గాజుపూస యయ్యె నొక్కొ ?

బంగరుగని యంచు నెంతొ
బ్రిమసి బ్రిమసి మురిసి తీవు
చిత్త మెల్ల సురిగిపోవ
నిత్తడిగా మారె నొక్కొ ?

అమృతఫల మ్మంచు నెంతో
యాసపడితి గాదె మనమ !
నోట నిడినయంత కాల
కూటవిష మ్మయ్యె నౌకొ ?

పూలహార మనుచు నెంతో
పొంగి మెడను దాల్చినావు
కంఠసీమ జేరినంత
కాలసర్ప మయ్యె నౌకొ ?

ప్రణయరత్న మనుచు మేను
పరవసమై గంతులిడితి
కౌగిలింప రక్త మాను
గబ్బిలముగ మారె నౌకొ ?

మరకతమాణిక్య మనుచు
మనసుపడితిగాదె మనమ!

## కాంచలేను ! కాంచలేను !

కాంచలేను, కాంచలేను
కనులు మూతపడెడు స్వామి !
మించుదీగయట్లు మిగుల మెఱయుచుండె నీదుమూర్తి
క్రించుదనము నొందిన నే గాంచలేను నీ తేజము ॥కాంచ॥
ఆనలేను, ఆనలేను
అధరామృతమును నాథా !
ప్రాణదాన మిచ్చి తాపబాధల పోగొట్టునీదు
ప్రణయామృత మాన లేని భాగ్యహీనురాల దేవ ! ॥ఆన॥
నిలువలేను, నిలువలేను
నిన్ను కౌగిలింపలేను
ప్రేమపవిత్రమ్మగు నీహృదయమ్మును దాకినంత
పాపమునిండిన నాయెద వ్రయ్యలౌనుగాదె నాథ! ॥నిలువ॥
పలుకలేను, పలుకలేను
భయము సిగ్గు వొడమునాథ !
వల పెల్లను నాయందే నిలిపినట్టి దేవ నిన్ను
ద్రోహము జేసిననాదగు దోస మెల్ల బయలుపడదె ?॥పలుక॥
కాంచలేను, కాంచలేను
కనులు మూతపడెడు స్వామి !

## వి హా ర ము

కొండకోనల నదుల వనముల
నెండచొరని నికుంజగృహముల
పండువౌ నెమ్మదికి నీతో
పడతి! తిరుగాడన్.

మండజేసెడు మండువేసవి
యెండసైతము నీవు నాదగు
దండ నుండగ సుకము నిచ్చును
పండువెన్నెలటుల్.

పండుఫలములు పూవుదేనెలు
నిండు నమృతము రుచులతోడను
నిండువలపున బ్రకృతిసుందరి
తాండవము సల్పున్.

గండుకోయిల పాట విని కం
తుండు ప్రేమోత్సాహ రభసత
తాండవింపగ పొంగి నాయెద
తప్పటలు జరచున్.

## కో యి ల

కోయిలా కోయిలా
కూయబోకే!
గుండెలూ బద్దలూ
చేయబోకే! కోయిలా॥

తీయనీ రాగాలు
తీయబోకే!
తీపితో నామనసు
కోయబోకే! కోయిలా॥

చిట్టినీ జ్ఞాపకం
చేయబోకే!
చింతతో ప్రాణాలు
తీయబోకే! కోయిలా॥

## ఎ డ బా టు

ఎన్ని తపసులు జేసి
ఈ జన్మ మెత్తితినో
చిన్ని నారాణి! నీ
చెట్ట బట్టితిని!
తపను గర్వాన యే
తప్పు జేశానో, నా
చిట్టి! యీ యెడబాటు
శిక్ష తగిలింది!

## ని రా లం బ స్థి తి

నట్ట నడి సంద్రాన
నావలో వున్నాను
నడినీటిలో ముంచుతావా?
నాసామి!
నావ వొడ్డట్టించుతావా? నట్టనడి॥

చీమలూ దూరనీ
చిట్టడవి లోపలా
చిక్కుకున్నానోయి దేవా!
ఏదైన
దిక్కొకటి చూపించుతావా? చీమలూ॥

ఆది అంతూ లేని
ఆకాశమధ్యాన
అల్లాడుతున్నాను దేవా!
దయ వుంచి
చల్లగా యిల్లు జేర్చేవా! ఆదిఅంతూ॥



## చిట్టి నిద్ర

నే మేలుకొనియుండ లేమ నిద్రించు
నావకడుపులోని నావికుబోలి
రాజుపాలన క్రింద రాజ్యమ్ముపోలె
తల్లిపక్కలోని పిల్లలా గొదిగి.

## * దాంపత్యము

పరుషము నాథా యన, నా
దరము ప్రియా యనగ, నింక దాసా యనగా
వరము కాదేని పశువా
పురుషుం డానాతి పలుపు (రజ్జు) బోల్పంగదగున్.

పండితులు మెచ్చి ముదమందు పరమ నాప్రి
యోగవిజ్ఞాన మెంచను యోగ్య మంచు
బాగుగా శిక్షనొందినవారికేని
ఆత్మవిషయాల నప్రిత్యయమ్మె కాదె.

## పలవరింతలు

చల్లన్ని చిట్టియొడిలోన తల వుంచీ
ఆకసమ్మున బౌలుమబ్బులను గాంచీ
గలగలని కదలేటి ఆకులను జూచీ
అన్నమూ నీళ్ళెందు కనుచు అడిగేను!

---

* కాళిదాసునుండి.

చిట్టి నాచెక్కిళ్లు చేతితో నిమిరీ
తియ్యగా ప్రేమమ్ము దెల్పేటివేళా
చిరునవ్వు నవ్వేటి చందుర్ణి గాంచీ
స్వర్గ మింకేటి కని పలువరించేను!

## సముద్రము

ఎంత లోతుంటుందో
యీ సముద్రము, చిట్టి!
అంతు లేనేలేద
నంటారు కాదా?

ఈ సముద్రము దరిని
నీ అగాధపు హృదయ
మది యేమొ, చిట్టి, నా
కట్టె తలపొచ్చింది
బ్రహ్మాండమైన నీ
ప్రణయాబ్ధిలో బడే
పిల్లకాలవను నా
ప్రేమ లెఖ్ఖా జమా! ఎంత॥

## రాజూ రాణి

రాజులలో రాజు నేను
రాణులలో రాణి వీవు
రాకుమారు డెపుడు కల్గునే
నాచిట్టి మనకు?
లోక మెపుడు సంతసించునే?

కవులకు కవిరాజును నా
కావ్యజగద్రాణి వీవు
కావ్యకన్య యెపుడు కల్గునే
నాచిట్టి మనకు?
దివ్యపదవి యెపుడు కల్గునే?

నాపాలిటి లక్ష్మి వీవు
నీపాలిటి విష్ణువు నే
నవమన్మథు డెపుడు కల్గునే
నాచిట్టి మనకు?
భవమోచన మెపుడు కల్గునే?

## ప్రణయకలహము

రోంయి రొయ్యని పాడు తుమ్మెదా
నీవు
కయ్యాలు వద్దనీ తుమ్మెదా

అలిమొగులసందు కయ్యం తుమ్మెదా
నున్న
నద్దంమీద పెసరగింజ తుమ్మెదా

వెయ్యి తేనెబొట్లు బోస్తా తుమ్మెదా
చిట్టి
కయ్యాలు మానిపిస్తె తుమ్మెదా.



## నాగులచవితి

నీ పుట్టదరికి నా పాప లొచ్చేరు
పాప పుణ్యమ్ములవాసనే లేని

బ్రహ్మస్వరూపులా పసికూన లోయి
కోపించి బుస్సలు కొట్టబోకోయి!
నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

చీకటిలోన నీ శిరసు తొక్కేము
కసిదీర మమ్మల్ని కాటేయబోకు
కోవపుట్టలోని కోడెనాగన్న!
పగలు సాధించి మా ప్రాణాలు దీకు
నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

అర్ధరాత్రివేళ అపరాత్రివేళ
పాపమే యెఱగని పసులు తిరిగేని
ధరణికి జీవనాధార మైనట్టి
వాటిని రోషాన కాటేయ బోకు!
నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

అటు కొండ యిటు కొండ ఆ రెంటినడుమ
నాగులకొండలో నాట్య మాడేటి

దివ్యసుందరనాగ! దేహి యన్నాము
కనిపెట్టి మ మ్మెపుడు కాపాడవోయి!
నాగులచవితికీ నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

పగ లనక రే యనక పనిపాటలందు
మునిగి తేలేటి నా మోహాలబరిణె
కంచెలు కంపలూ గడచేటివేళ
కంపచాటున వుండి కొంప దీకోయి!
నాగులచవితికీ నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!



ఏ మొ

ఈ యగాధ నిశీధాన నెట్టయెదట
వెలుగు కన్పించె నని అదే కులకబోకు
కోటివిదయ్యాలొ? యెవ్వరైన నరులయొక్క
కరములం దుండు దీపాలకాంతు లేమొ?

ఈ యఖండసముద్రాన నేరి కోరి
సంచులకు నిండ దెస్తిని సంప దంచు

మురవగా జోకు కిందుమీా దెరగకుండ
నత్తగుల్లలో! మంచి రత్నాలో యేమొ?

ఈకికారణ్యమధ్యాన నిచట నచట
దిరిగి యేవేవొ వేళ్లేవొ తీగలిన్ని
మోపులకు దెచ్చినా నని మోజుపడకు
చచ్చుతీగెలో? జీవనౌషధులో యేమొ?

ఈ మహాతిరణాలలో నీడనాడ
నెఱుక లేని మనుష్యులపరిచయమ్ము
లబ్బెగా. యంచు నుబ్బి తబ్బిబ్బు లవకు
శత్రులో? ప్రాణ మిచ్చేటి మిత్రు లేమొ?

ఐ క్య మౌ దా మె?

ఆమబ్బు యీా మబ్బు
ఆకాశ మధ్యాన
అద్దుకున్నట్లు మన
మైక్య మౌదామె?

ఆ తీగ యీ తీగ
అడివి పొదరింటిలో
అల్లుకున్నట్లు మన
మైక్య మౌదామె?

ఆ వాగు యీ వాగు
అడ్డాలకోనలో
యేకమైనట్లు మన
మైక్య మౌదామె?

ఆ మాట యీ మాట
అర్థాంతరములోన
వాక్యమైనట్లు మన
మైక్య మౌదామె?

## పితృస్మృతి

తల్లియును దండ్రియును గూడ తానె యాచు
ప్రాణములకన్న నెక్కుడు ప్రాణముగను
నన్ను గాచి పెంచిన నాదు కన్నతండ్రి
యాత్మకు నొసంగు శాంతి నాత్మైకనాథ!

## స్వా గ త ము

(మా మంగళపత్రిద జన్మకథ)

అమ్మా ! ఓ లోకమాత
రావమ్మా నా స్వాగతమ్ము॥ అమ్మా॥

ఎల్ల జగమ్ముల నేలెడు
తల్లి మా యింట చిట్టి
పిల్లవుగా జన్మింపగ
నుల్లమునన్ గోరి వచ్చి
తమ్మా ఓ లోకమాత !
రావమ్మా నా స్వాగతమ్ము.

సకల చరాచర ప్రపం
చము లెల్ల జరించి వచ్చి
తల్లి ! దయను నేటికి నా
యిల్లు పావనమ్ము జేసి
తమ్మా ! ఓ లోకమాత !
రావమ్మా నా స్వాగతమ్ము.

నా తపమ్ము ఫలియించెను
నా జన్మము ధన్య మయ్యె

నో తల్లీ! నేటికి నీ
వుదయ మౌట నా యింటను
నమ్మా! ఓ లోకమాత!
కొమ్మా నా స్వాగతమ్ము.

## కడుపుతీపి

ఆకసమ్ము చిల్లి పడ్డ
యట్లు వర్ష మేకధార
కుండపోత బోసి కొట్టి
కుమ్మరించి దిమ్మరించె

క్రూరపు నీకాళరాత్రి
ఘోరమైన రుద్రభూమి
దల్లీ! నా మంగళప్రి
దా! తడియుచు వడకుచుండె?

ప్రణయసామ్రాజ్యపట్ట
భద్రిడవై నిద్రాళుల

పరమ కృపా పూర్ణదృష్టి
పాలించెడు పరమేశా!
రుద్రభూమి నేకాకిగ
నిద్రించెడు మమ్ము గన్న
మంగళప్రదను నిద్రా
భంగ మొదవకుండ గాచి
కరుణామృతధారల నాఁ
కలిదప్పుల బాధ దీర్చి
చల్లనైన జోల పాడి
మెల్ల మెల్ల జోకొట్టుము!

ఈ సాయము జేయుము నీ
ఋణము దీర్చికొందుమయ్య
ఈ జన్మను గాకున్నను
నింకొక జన్మముననైన!!

## చ లి పి డు గు

ప్రళయాంతాభీలనభో
దళన ఘెళ ఘెళారవముల
జలిపిడుగా! గర్జింపకు
నిలిచి నాదు మనవి వినుము

బంగారపుబొమ్మ నాదు
మంగళప్రదమ్మ యొంటి
రుద్రభూమి గటికనేల
నిద్రించెడు నొడలు మరచి.

చూపబోకు మచట నీప్ర
తాప మెల్ల పిడుగా? నా
కన్నతల్లి యడిలి లేచి
కక్కటిల్లి యేడ్వగలదు!

కడుపుమంట గనలి పొక్క
కన్నతండ్రి నైననాదు
పలువరింతమాటలకును
నలుక బూన కయ్య మదిని!

ప్రళయాంతాభీలనభో
జళన ఘళఘళా రవములు
జలిపిడుగా! గర్జింపకు
నిలిచి నాదుమనవి వినుము!

---

## దోపిడి

కత్తి బెట్టీ పొడిచినావోయ్ దేవా!
గాయ మింకా మానలేదోయ్ దేవా!
నిలువూన యిల్లు దోచేశావ్ దేవా!
వెలలేనిమణిని కాజేశావ్ దేవా!
అమృతపాత్రము దొంగిలించావ్ దేవా!
అందులో విషము తాగించావ్ దేవా!

---

## శాస్త్రి

ఏనాడు నాటితినో
యీావలపుమాను?
చిట్టి! లతలా నన్ను
చుట్టుకున్నావు!

వెనకజన్మలో యేమి
    పెట్టి పుట్టితిమొ ?
బంగారుపండంటి
    పసిబాల కలిగె !

పెట్టి యెవరిని యేమి
    తిట్టుకున్నామొ ?
ఇచ్చిన్న దైవమూ
    మర్చిపోడాయె !



## నిర్వాణసుఖము

నా మంగళప్రదా ! నా చిన్నితల్లి !
  మరువలేదే నిన్ను మాకన్నతల్లి !
  ఉదయాన సూర్యుడీ పదనకాంతులలో
  బంగారు నీమేనిచాయలే గందు !

  మల మలా మాడ్చేటి మధ్యాహ్న వేళా
  గల గలా గలమని క్రింద రాలేటి

పండుటాకులు పాట పాడుతుండంగ
చిట్టి! నీయేడ్పు విని దద్దరిల్లేను!

పడమటా సూర్యుండు కుంకేటి వేళా
సందెకాంతులు కళ్లపండ గావేళా
వికసించి నవ్వేటి బీరపువ్వులలో
చిరినవ్వునీ మోము చూచి మురిసేను!

వెర్రిలోకము సద్దు మణిగిన్న వెనక
మెత్తన్ని మబ్బు పొత్తిళ్లలో వొదిగి
బజ్జుని మింట వుయ్యాల లూగేటి
చంద్రుణ్ణి నీమేని పట్టబొయ్యేను!

మాయదారీ నిద్ర మచ్చుపొడిజల్లి
మనసు గొని దివ్యలోకాలన్ని దిప్పి
తుదకు దయచేసింది నా చిన్నితల్లి!
నీసన్ని ధనియేటి నిర్వాణసుఖము!

# సంవత్సరాది

బాలభాస్కరా! అపుడే
వచ్చితివ ఉగాది యంచు
బంగరు కిరణాల దుస్తు
లం గడు మెరయుచు కులుకుచు ?

గల గల మని వీచెడు చిఱు
గాలిపాట కలరియాడు
మావియాకులార! మఱచి
పోవుదురే యింతలోనె
వెన్నెలలో నాయెదపై
బన్నుండి భవద్దర్శన
మ్మున బ్రహ్మానందమ్మును
గను ముద్దుల నాబిడ్డను ?

తోరణాల దూర నేగు
తొందరలో నున్న మిమ్ము
నాపబోను, లోలోనె
యీవేదన నడచికొనెద !

వేపకొమ్మలార! నాల్గు
వేళల నా బిడ్డపైని
ప్రాణవాయువులను వీచి
బ్రదికించెద రనుకొంటిని!!

కాని శాస్త్రసిద్ధాంతము
కందని యొక మహాశక్తి
నాదుబిడ్డ గొంపోయెను
మీ దేమున్నది పాపము!

మినుకు మినుకు మినుకు మనుచు
మింట మెరయు చుక్కలార?
చెప్ప రేల మీలో నా
చిన్నితల్లి యెవ్వరొక్కొ?

చెప్పవద్దులే వరాల
కుప్పను కాపాడి మరల
నప్పగింపు డీ స్వర్గము
నందున మా కంతె చాలు!

అమృతకిరణ కన్నె మంగ
ళప్రద బ్రదికింప జాల

నైతి నంచు సిగ్గు జెంది
యధోగతిని బోయితివే ?

చాలును నీలాంఛనమ్ము
లేల ? నేడు గాకయున్న
రేపైనను రావాకో
నీపస జగ మెఱుగనిదే ?

కన్నకడుప నేమి, నీకు
కలుగు నెట్టు లహర్నిశలు
కనలి పొక్క జేయు నాదు
కడుపుమంటవలని తపన ?

పోయినవత్సరపు సుఖము
బుల్లితల్లితోనె పోవ
నూతనసంవత్సరాది
సీతీరున వగవనాయె !!



## నడమంత్రపు సిరి

కోయి లొకసా రొచ్చి కూసిపోయింది
మాయవానలు లోకమంత ముంచినవి

పం డొకటి చేతులో బడి జారిపోయె
మండువేసవికి చె ల్లైండు జూపినవి
మెఱు పొకటి మింటిపై మెఱిసిపోయింది
ఉఱుములు భూమి నఱ్ఱూత లూపినవి.

## దీపావళి

(యమునాకళ్యాణి - జంపెతాళం)

లోకాని కుత్తుత్త దీపావళీ
నాకుమాత్రము దివ్య దీపావళీ!
వేదాల నాథుడో
వేదాద్రి నరసింహ
దేవుడే నాయింట
దీపమైనాడు!
లోకాని కుత్తుత్త దీపావళీ
నాకు మాత్రము దివ్య దీపావళి!
వేద వృక్షములాగు
వేదాద్రి నీడ నా

వంశ వృక్షమ్ము శా
శ్వతముగా నిలవాలి!
లోకాని కుత్తుత్త దీపావళీ
నాకు మాత్రము దివ్య దీపావళీ!

## జే జే లు

ఎవ్వ రను కున్నారో ఎరగరా మీరు?
పాపాయి సాక్షాత్తు పరమాత్ముడండీ!
తరతరాలా గొప్ప తపసు జేశాము,
స్వామి నాటికి నేడు వర మిచ్చినాడు ఎవ్వ॥
ఎన్నో యుగాలుగా విన్నవించాము
ఇన్నాళ్ళ కీనాడు విన్నాడు మనవి! ఎవ్వ॥
వేదాద్రినాథుడే వెలిసి నాయింట
ఉయ్యాలతొట్టిలో ఊగుతున్నాడు! ఎవ్వ॥
చేతులెత్తండోయి జేజేలనండోయ్,
నరసింహదేవుడే నాచిట్టితండ్రోయ్!
ఎవ్వ రనుకున్నారో ఎరగరా మీరు?
పాపాయి సాక్షాత్తు పరమాత్ము డండీ!

## పాపాయి లీలలు

(వాగీశ్వరిరాగము - జంపెతాళము - ఖండజాతి)

దినదినము పాపణ్ణి దీవించి పోండీ
దేవలోకములోని దేవతల్లారా!
నాపాప నిద్దట్లో నవ్వుకుంటాడు
ఆస్నెకాలాడేనో అప్సరలతోను? దిన॥

మాతండ్రి నిద్దట్లో మాటాడుతాడు
తెలియజెప్పేనేమొ దేవరాశ్యాలు? దిన॥

కన్నయ్య నిద్దట్లో కన్నుగిలికేను
నైత్రిలోకము జూచి వెక్కిరించేనో? దిన॥

వాగీశ్వరీ ప్రేమరాగ మాలించి
చిన్నయ్య బభ్రోసర శ్రీరామరక్ష! దిన॥

## ఉపశాంతి

వేదాద్రి శిఖరాన వెలిగేటిజోతి
నాపూరిగుడిసెలో దీపమై వున్నె!

స్వర్గ పుద్యానాల వాసించు పూవు
నా మోటుచేతిలో నలిగిపోయేనె?

భూర్భువర్లోకాల బోయేటి పిట్ట
కటిక నాకౌగిట్ల కైదులో వున్నె?

పరమాత్ముడౌ జగద్వ్యాపి పాపాయి
ఇరుకు నాగుండెలో యిమిడిపోయేనె?



## జీర్ణం జీర్ణం

వేదాద్రి శిఖరాన వెలిగిన్న జోతి
మినుకు మని కాసేపు కునికిపోయింది!

దేవలోకమునుంచి దిగినట్టి గంగ
వచ్చిన్న దారినే పట్టి మళ్లింది!

పంజరం దూరిన బంగారు పిట్ట
తలుపు దీ సేవేపొ తర్లిపోయింది!

కాపుర మొచ్చిన కన్ని పాపాయి
యిల్లు కాళీజేసి వెళ్లి పోయాండు!

# అ డ వి సీ మ

(వాయుసందేశమునుండి)

ఎండవేడిమి జగ మెల్ల మండ జేసి,
చండశాసనుడై ప్రజం జెండి తుదకు
కాల మైపోవ నవసానగతిని జెందు
క్రూరనరపాలునట్టుల కోష్ణకిరణు
డయ్యె సూర్యుండు, ఎల్లెడ నాకసమున
నెఱ్ఱనౌ కాంతితోడుత నెన్ని యెన్నొ
వింతరంగులు కలియంగ వెల్లివిరిసె
నిరుపమాద్భుతశోభలు, నేత్రపర్వ
మయ్యె నాకాంతి బ్రకృతి యత్యంత మపుడు.
అది మిగుల నందమౌ నొక యడవిసీమ
జానపద మెచ్చటను చెంత గానరాదు.

నిర్మలంబును స్వచ్ఛమౌ నీటితోడ
నిరుగెలంకుల మింటికి శిరసు లెత్తు
నారికేళ వృక్షమ్ములనడుమ నుండి
యెడతెగని పాట బాడుచు నేగుదెంచు
నల నదీవాహమ్ములగానమ్ము దక్క
వేరు శబ్దమ్ము లేవియు వినబడ వట.

కఠిననియమములుగాక సత్కర్మనిరతు
లగుమహాపురుషు లుండగా దగుప్రదేశ
మచట దుర్మార్గులకు సైత మలవడెడిని
సర్వసౌఖ్యంపుమూలమా శాంతగుణము.

## వె న్నె ల రే యి

( వాయుసందేశమునుండి )

ఇంతలో చందురుం డుదయించె మింట,
వెన్నెలలు జగమెల్లను వెల్లివిరియ
పాలసంద్రంబువోలె ధావళ్య మంది
ప్రకృతి వెలుగొందె కన్నులపండు వౌచు

మెత్తనౌ దూదిమబ్బులు మింట పర్వ
లెత్తుచుండెను చందురుం డొత్తుకొంచు
బోవుచును వెండి నునుపూత బూయుచుండ
నంచులకు వినూతనశోభ లలముకొనగ
పల్లవలతాతరు లవెల్ల తెల్లనయ్యె
వెండిరేకులు నదిపైన విస్తరిల్లి

అటునిటులు కదులుచుండెడు నలలతోడ
నాటలాడుచు నది కెంతొ యందమిచ్చె

అంతటను నల్లుకొని కాంతి నతిశయిల్లు
నా విమలమైన వెన్నెల నడవిమల్లె
పొదలపైనుండి కమ్మని పూలతావు
లెల్లెడం జిమ్ముచును వీచె చల్లగాలి
చచ్చిపోయినవారికి సైతమట్టె
జీవమిచ్చి మేను నిమిరి సేద దీర్చు
చల్లనౌ మలయపవనము మెల్ల వీవ
మేనిపై, నెమ్మన మెల్ల మెలకువ గనె.



## ఎడబాటు

(వాయుసందేశమునుండి)

ఘోరచింతాగహనసీమ దారి గాన
కటు నిటులు చీకటిని బార్కులాడుచుండి
కడకు నిను గాంచు భాగ్యంబు గంటి నింక
నీవె నా దిక్కు నా యాశ నీవె సఖుడ!

అతివతో తిన్నగా సౌఖ్య మనుభవింప
లేము లోకమోహనమగు లేమసొగసు
మఱపు రాకుండ తిరముగా మదిని నాట
హృదయఫలకమ్ముపైని చిత్రింపలేదు!
ఇంతలోనె నా మురిపెపు టింతితోడ
నేల నీ యెడబాటు జనించె సఖుడ!

చెవులపండువు సేసెడి చెలియవలపు
పలుకుదేనెల తమి గ్రోలి పరవసమ్ము
జెంద లేదింతలోనె నా చెలికి నాకు
నేల నీయెడబాటు జనించె సఖుడ!

నాతి నెయ్యంపుచిన్నెగా నాటినట్టి
వలపుతీగె లేజివుళ్ళు మొలచి పూలు
పూయలేదింతలోనె నా పొలతితోడ
నేల నీయెడబాటు జనించె సఖుడ?

కలలోనైనను నెడబాటు గలుగునంచు
నించుకైనను మదిలోన నెంచ నకట!
సకియతో నెల్లకాలము సకలసుఖము
లనుభవించెదనం చెంతో యాసపడితి.

## నోము

( వాయుసందేశమునుండి )

పూతకృష్ణానదీజలస్నాత యాచు
సగము తడియారుచున్న వస్త్రమ్ము దాల్చి
శ్రీమ మటంచు భావింపకే సంతసమున
గిరిశిఖర మెక్కి రామలింగేశ్వరునకు
భక్తి నభిషేక మొనరించి ప్రముదితాంత
రంగయై వాసగృహము జేరంగబోవు
చేరి, పూజాగృహమ్మున గౌరిదేవి
పసుపు విగ్రహమును వేదిపై నమర్చి
పూల కుంకుమాక్షతలను బూజ చేసి
వానిలో కొంచెము శిరస్సుపైన దాల్చి,

మాతకు బ్రణామ మొనరించి మహితభక్తి
దేవి కారగింపుగ నిడ్డ తీయజామ
పండు గైకొని ప్రేమమ్ము నిండుమదిని
తేనె లొలుక "అక్కా" యని దీనముగను
పంజరమునుండి పిలిచెను పంచవన్నె
రామచిల్కకు దినిపించి, 'శ్యామవిభుకు

చేతితోడ బెట్టకయె భుజింపుచుంటి
గాదె' యని గద్గదిక బల్కు కాంత గనుమ!

## ఆంధ్రవీథి

( వాయుసందేశమునుండి )

చుట్టు నున్నట్టి పర్వతాల్ పెట్టనట్టి
కోటగా నొప్పు బొబ్బిలికోటదరిసి
గాండ్రుగాండ్రుని తీండ్రించు తాండ్రపాప
రాయు బొబ్బిలిపులి యని ప్రథితకీర్తి
గన్న వీరు దలచి మందగతిని బొమ్మ!

కళలకుం గవులకు హారికథకులకును
గాయకులకు పండితులకు గణికలకును
పుట్టినిల్లదె! రణమున దిట్ట యయ్యు,
దొంగపోటున శత్రుచే భంగపడిన
విజయరాముని నగరంబు, నిజము జెప్ప
దాని కీడగు పురము నెందేని గనవు!

చెంత జేరి సముద్రమ్ము చిందులాడ
ఇంపొసగు లతలతో సెలయేళ్లతోడ

రమ్య మైయొప్పు సింహాచలమ్ముపైన
భక్తవరదు సింహాద్రియప్పని భజించి
యచటి ప్రకృతివిచిత్రమ్ము లరసి చనుమ!

పావనక్షేత్రముల కెల్ల పావనమ్ము
మీరి దక్షిణకాశియన్ పేర బరగు
పాదగయతీర్థమున గ్రుంకి భక్తితోడ
దగ్ధశవహవ్యధూపసంతర్పణమ్ము
కుక్కుటేశ్వరునకు జేసి మ్రొక్కి చనుమ!

పరమసాధ్వి పతివ్రత భర్తతోడ
సాగుమానము జేసిన సచ్చరిత్ర,
కాపుకోడలు కామమ్మ, కలియుగాన
బొందితోడ కైలాసమ్ము నందినట్టి
పుణ్యభూమి దర్శింపక పోకుమోయి,
కులము తీరెంచ నేటికి గుణము కల్గ!
కులుకులాడి, మాయావిని, క్రూరమదన
బాణహత, మారుతల్లి, త న్వలచి విఫల
మై నిజేశునితో కల్లలాడి, తనదు
కాలు సేతులు నరకింప, నేల గూలి
నట్టి సారంగధరుమిట్ట యదియె! అచట
చల్లగా వీచుమా, నీదు జాలి తెలియ!

## ఇంద్రకీలాద్రి

(వాయుసందేశమునుండి)

అల్లదే ఇంద్రకీలాద్రి, ఆకసమ్ము
పై కెగయబ్రాకు, నల్ల యా ప్రాంతగుడిసె
పార్థుడా శైలశిఖరాన పాశుపతము
బడయ శివుగూర్చి ఘోరతపమ్ము జేసె!

కార్యశూరత డక్కి నిర్వీర్యులౌచు
కన్న భూమాతకును కళంకమ్ము గూర్చు
పరమనాస్తికు లిప్పుడు తపఃప్రభావ
మెల్ల బూటక మంచు నిందింతు రకట!

ఆ నగోత్తమమున నధిష్ఠాన దేవి
కనకదుర్గాభవాని లోకాలతల్లి
తొల్లి తన యుగ్రశక్తుల నెల్ల నొక్క
బాలసన్యాసి ఘనతపోబలముకతన
గోలు పడి, యొంటి నివసింప దాళలేక
స్త్రీజనోచిత కోమలప్రేమ చకిత
చిత్తయై, మొన్న మొన్న నే చెంత జేర
విభుని మల్లికార్జునుని రప్పించుకొనియె!

లమరు తట్టల దింప వీలైన యెత్తు
రాలదిమ్మ లెత్తించి, మార్గంబులందు
కడకు చలిబాధ వగచు నక్కలకుగూడ
వస్త్రదాన మ్మొసంగిన పరమధర్మ
మూర్తి, లోకాంతరవ్యాప్తకీర్తిచంద్రి
కావిరాజితు డుత్తమకవులు భక్త
వరులు యోగులు మొదలగువారిచేత
ననవరతము పొగడ్తల నంది మున్న
అమితకీర్తి గొన్నట్టి ధర్మాప్పరాయు
యశము విని మది నెంతయు నబ్బురపడి
అకట, అతడు నేడు లేడే,యని యార్తి గనెదు!
కాని, మదిని క్రీడాసక్తి కల్గనేని
వాలుజడ వేసుకు గులాబివలువ గట్టి,
పొంకమా వేణి చామంతిపూలు ముడిచి,
ముద్దుమోమున నిల్వుగా బొట్టు వెట్టి,
పుక్కిట విడెమ్ముతో, నల్లిపొరలపైట
'సెంటు చేను కెకరమ్ము కంచె' యన జెల్లు
పెద్ద లంగా పయిం దాల్చి, వీథు లూడ్చు
చును విటుల నోరచూపుల జూరగొంచు
చక చకను వచ్చు నాదాసి జారుపైట

పారదోలి నడివీథిని పట్టపగలు,
నల్గు రెదుటను దానికి న్నవ్వ్వబాట్లు
కల్గజేసి కౌతుకమును గాంచి చనుమ!
రమ్యముల్ ఫలభారనమ్రిమ్ములైన
ఆమ్రి నారంగ సీతాఫలాదివనము
లందగించు కాషాయజలాశయప్రి
వర్ధితము లౌచు పురికి నల్వంకలందు!

## కన్నె నోము

* (శాఫోగీతము)

కన్నెనై యెల్లపుడు కాలమ్ము బుత్తు
నీవు నా భర్తవు గావేని ప్రియుడ!
పరపురుషు డెవ్వడున్ బడయడు నన్ను
ఇప్పటికేని యింకెప్పటికేని.
ఈ వొక్కడవె సుమ్ము యేరగాగలవు
అతిసుకుమార మీా యందంపుసుమము
అద్దుకు, దివ్యమౌ నగరుధూపమ్ము
బలె, దీనితావి గాపాడు మెల్లపుడు

* శాఫో, గ్రీసుదేశపు కవయిత్రి

నీవె సుమి నాప్రేమ నెమ్మనమ్మందు
జ్ఞాపక ముంచుకోగలవు, రాగల్గు
కాలాల మోదమ్ము, గర్వమ్ము, శాంతి,
రాగమ్ముతో పవిత్ర మొనర్పగదె!

### ప్ర ణ య గా న ము

( శాఖోగీతము )

కదలేటి రెల్లులకన్న లోలను నేను,
వలపుచే నదిలోని జలమట్టు లైతి
మలయ వాయువుబోలి యలమె నీపాట నర
ప్రియుడ! చపలంపు నా హృది యెల్ల వినెదు
ఇశ్శో యనిన కృంగి, ఈవు మోద మ్మంద
ప్రొద్దుతిరుగుడుపూవు బోలి పొంగుదును.

### సౌ ం ద ర్య పి పా స

( శాఖోగీతము )

అలల నురగలతోడి నాడేటిదేవ!
సర్వదానము లిచ్చు సంద్రింపు రాజ!

# ఇంద్రకీలాద్రి

(వాయుసందేశమునుండి)

అల్లదే ఇంద్రకీలాద్రి, ఆకసమ్ము
పై కెగయబ్రాకు, నల్ల యా ప్రాతగుడిసె
పార్థుడా శైలశిఖరాన పాశుపతము
బడయ శివుగూర్చి ఘోరతపమ్ము జేసె!

కార్యశూరత డక్కి నిర్వీర్యు లౌచు
కన్న భూమాతకును కళంకమ్ము గూర్చు
పరమనాస్తికు లిప్పుడు తపఃప్రభావ
మెల్ల బూటక మంచు నిందింతు రకట!

ఆ నగోత్తమమున కధిష్ఠాన దేవి
కనకదుర్గాభవాని లోకాలతల్లి
తొల్లి తన యుగ్రశక్తుల నెల్ల నొక్క
బాలసన్న్యాసి ఘనతపోబలముకతన
గోలు పడి, యొంటి నివసింప దాళలేక
స్త్రీజనోచిత కోమలప్రేమ చకిత
చిత్తయై, మొన్న మొన్ననే చెంత జేర
విభుని మల్లికార్జునుని రప్పించుకొనియె!

ప్రీతి దయ్యును నా వధూవరుల ప్రేమ
నవనవానందజనక మై భువనతతికి
పరగ నిత్యకళ్యాణమ్ము పచ్చతోర
ణముగ శోభిల్లజేయు నన్నగవరమును !

ఆలయముప్రక్క కోనేరగాధమైన,
దప్సరస్త్రీలు రాత్రిల నచట జలక
మాడి, దేవిని పూజించి వీడినట్టి
పసుపుకుంకుమ మక్షతల్ కుసుమము లవె !

ఆ కొలని చెంతనున్న గుహాంతరముల
యుగములాదిగ మునివరుల్ యోగనిరతు
లై నిమీలితలోచను లగుచు లోక
సంగ్రహార్థముగ తపమ్ము సల్పుచుండ్రు !

అద్రిశిఖరమ్ముపై కిరాతార్జునులు మ
హాహవ మ్మొనరించిన యట్టిచోట
నేటికిని చిన్నె లగుపించు వాటివలన
విజయువాడ యంచు పురికి పేరు కలిగె !

చుట్టు నున్నట్టి పర్వతాల్ పెట్టనట్టి
కోటలై యొప్ప శాత్రవకోట్ల కెల్ల
మిగుల దుర్భేద్యమై పండువగుచు కనుల
కలరు మా విజయునివాడ, చెలిమికాడ !

కాలువలు నల్గడల నలంకారములుగ
జెలగ, జలయంత్రనిర్గత జలకణాళి
మౌక్తికాహారభూషిత మందిరాంగ
ణోల్లసత్ పుష్పవల్లుల నొప్పుపురము!
వారకాంతలు నివసించు వాడలందు
గాన నృత్తానుకర మృదంగములదైన
స్నిగ్ధగంభీర ఘోషము చెవులబడిన
తోడనే మేఘరవమంచు దోచు నీకు!
భాగ్యవంతులు మేడల పాన్పులందు
మందమతులట్లు పొరలాడుచుందు రకట!
అన్నమో రామచంద్రా యటంచు నెండ
నేడ్చు బీదవానికి నిల్వనీడలేదు!
కాంచుమా కృష్ణవేణి, దుర్గాంబ పైడి
ముక్కుపో గందుకొన పంత మూని వేగ
వచ్చు నాటోపముగ పరవళ్ళతోడ
చెంగలించుచు నార్చుచు భంగపడుచు!
ఇంద్రకీలాద్రి కాసింత సందు నీయ
కృష్ణవేణి మోమోట మింతేని లేక
చీల్చి భేదించి ప్రవహించు చెచ్చెర నదె
చనువునిచ్చిన నెక్కును చంక కనగ.

## నూ జ వీ టి పో తు గ డ్డ

(వాయుసందేశమునుండి)

అడవిమార్గమ్ము లన్నింటి గడచి కడచి,
శర్వరీసార్వభౌము డపూర్వకీర్తి
వైభవోపేతు డౌచు చెల్వొందుచుండ,
శుభ్రపుఙ్ జ్యోత్స్న లవనిపై సుప్తి జెంద
గగనతలమున దూరాన గానిపించు
రజతశైలాగ్రసదృశవిరాజమాన
రాజహర్మ్యాగ్రతలములు రాణువొప్పు
నప్పరాయనరేంద్రుల యాటపట్లు!

చుల్కనగ జూడబోయెదు సుమ్ము, మున్ను
మేకపిల్ల తోడేలితో మించి పోరి
నట్టి మేల్పోతుగడ్డ మా పట్టణమ్ము.
ప్రథితవీరావతంసులవాస మయ్యె.
తల్లి మాకోలమహిష మ్మదయ తొలంగ,
వేణుగోపాలు డల్కమై వీడి చనగ,
పతియు బందుగులుఙ్ వీడ ధృతి తొలంగి
వేఱుచందమై తోచెడు వెలదివోలె,
పూర్వవిభవచిహ్నమ్ములౌ బురుజు లెల్ల

కాలచక్రహతి న్నేల గూలిపోవ,
నేడు శిథిలమ్ములై కోటగోడ లవిగొ,
పేదలై కనుపట్టుచు ఖేద మొసగు!
వేణుగోపాలు భక్తి సేవించి, పిదప
మాన్యులౌ మత్పూర్వు లమాత్యవరులు
ఆర్యధర్మపద్ధతియు లోకానుభవము
మెండుగ నెఱింగి, శివితో నిండుసభను
రాచకార్యాలు దీర్చిన రచ్చచింత
నీడ నొక్కింత నిలిచి, మావీడు మున్ను
జెలగినట్టి చోటును గాంచి, చెలిమికాని
పూర్వవైభవమున్ దలపోసి చనుమ!
పాయె నానాటిపూష్వల వైభవమ్ము,
మాసె వారిపరాక్రమమహితదీప్తి,
కాలగతి మార్పు లెన్నేని కల్గుచుండు
చక్రనేమిక్రమమ్మున జగతిలోన!
వేసవిన్ దాహముం గొన్న పిట్టలకును
దొన్నెల న్నీరు వోయించి, యెన్నతరము
కాని భూతదయన్ దోమ కాటుగన్న
పసులు మేను రాచికొనగ బండరాళ్ళ,
గొల్లభామలు బరువైన చల్లకుండ

లమరు తట్టల దింప వీలైన యెత్తు
రాలదిమ్మ లెత్తించి, మార్గంబులందు
కడకు చలిబాధ వగచు నక్కలకుగూడ
వస్త్రదాన మొసంగిన పరమధర్మ
మూర్తి, లోకాంతరవ్యాప్తకీర్తిచంద్రి
కావిరాజితు డుత్తమకవులు భక్త
వరులు యోగులు మొదలగువారిచేత
ననవరతము పొగడ్తల నంది మున్న
అమితకీర్తి గొన్నట్టి ధర్మాప్పరాయు
యశము విని మది నెంతయు నబ్బురపడి
అకట, అతడు నేడు లేడే,యని యార్తి గనెదు!
కాని, మదిని క్రీడాసక్తి కల్గెనేని
వాలుజడ వేసుకు గులాబివలువ గట్టి,
పొంకమౌ వేణి చామంతిపూలు ముడిచి,
ముద్దుమోమున నిల్వగా బొట్టు పెట్టి,
పుక్కిట విడెమ్ముతో, నల్లిపొరలపైట
'సెంటు చేను కెకరమ్ము కంచె' యన జెల్లు
పెద్ద లంగా పయిం దాల్చి, వీథు లూడ్చు
చును విటుల నోరచూపుల జూరగొంచు
చక చకను వచ్చు నాదాసి జారుపైట

పారదోలి నడివీథిని పట్టపగలు,
నల్లు రెదుటను దానికి న్నవ్వుబాట్లు
కల్లజేసి కౌతుకమును గాంచి చనుమ!
రమ్యముల్ ఫలభారనమ్రిమ్ములైన
ఆమ్రి నారంగ సీతాఫలాదివనము
లందగించు కాషాయజలాశయప్రి
వర్థితము లౌచు పురికి నల్వంకలందు!

## కన్నె నోము

* ( శాఫోగీతము )

కన్నెనై యెల్లపుడు కాలమ్ము బుత్తు
నీవు నా భర్తవు గావేని ప్రియుడ!
పరపురుషు డెవ్వడున్ బడయుడు నన్ను
ఇప్పటికేని యింకెప్పటికేని.
ఈ వొక్కడవె సుమ్ము యేరగాగలవు
అతిసుకుమార మీా యందంపుసుమము
అద్దుకు, దివ్యమౌ నగరుధూపమ్ము
బలె, దీనితావి గాపాడు మెల్లపుడు

* శాఫో, గ్రీసుదేశపు కవయిత్రి

నీవె సుమి నాప్రేమ నెమ్మనమ్మందు
జ్ఞాపక ముంచుకోగలవు, రాగల్గు
కాలాల మోదమ్ము, గర్వమున్, శాంతి,
రాగమ్ముతో పవిత్రి మొనర్పగదె!

## ప్ర ణ య గా న ము

( శాఖోగీతము )

కదలేటి రెల్లులకన్న లోలను నేను,
వలపుచే నదిలోని జలమట్టు లైతి
మలయ వాయువుబోలి యలమె నీపాట నన్
ప్రియుడ! చపలంపు నా హృది యెల్ల వినెడు
ఇళ్ళో యనిన కృంగి, ఈవు మోద మ్మంద
పొద్దుతిరుగుడుపూవు బోలి పొంగుదును.

## సౌ ౦ ద ర్య పి పా స

( శాఖోగీతము )

అలల నిరగలతోడి నాడేటి దేవ!
సర్వదానము లిచ్చు సందగింపు రాజ!

నను సృజించితివి నీ మనసొచ్చినట్ల
మిగుల ప్రేమించేటి మేటి శక్తిచ్చి
తిస్సి, నాచపలంపు హృదయ మేనుందు
నిలను నందపువస్తువుల నెల్ల గోరి
కమలేందువదన నామముల రెండింట
నెది యందమైనదో యేర్పరుపలేము!

## ప్రేమ తర్కము

(శాఫోగీతము)

చావే మేలని యంటావే
దేవత లేటికి చావరురా?
ప్రాణమె చేదని యంటావే,
బ్రతుకుదు రేలను దేవతలు?
ప్రేమ వొట్టిదే యంటావే,
ప్రేమింతు రేల దేవతలు?
ప్రేమే సర్వ మ్మంటావే,
ప్రేమింప కేమి సేతుమురా?

## ప్రేమ శక్తి

( శాఖాగీతము )

నిశ్చలసత్యముతో జతగూర్చిన
నెంతో శక్తివంతంబౌ ప్రేమము,
దేవతలైనన్ దాని ధాటికిని
లోబడి పోవలసినవారే,

చపలము వికటము నుండీ ప్రేమము
చంపెడు నొకమాటే, యొకచూపే,
కావున, జాగ్రత కాముకులారా,
యేవిధ ప్రేమల మెలగెదరో!

## చుక్కలరాక

( శాఖాగీతము )

చెలియింటిముందర కల దొక్కమఱ్ఱి
దిన మెల్ల నట గాలి తీయగా బాడు
సంజ గూర్చుని కలిసి, చల్లనిసీలి
నింగి చుక్కలరాక నీక్షింతు మచట.

## వలపుల జోల

( శాఫోగీతము )

నిద్దుర బోవే, ఓ చెలియా
　　నీ వలపుంబిగియు కౌగిలిలో
మోటకాల్వయందున జీవజల
మ్ములు గుసగుసలాడుచు బోవగ
మిణుగురు పురువులు వెన్నెల నిటు నటు
మిణుకు మిణుకు మని మెఱయంగా
　　నిద్దురబోవే ఓ చెలియా
　　నీ వలపుంబిగియు కౌగిలిలో.

తుటిసౌఖ్యమె, కట్టా, త్వరలోనే
పిట్టలు లజ్జారవముల గూయగ,
బాలభాస్కరుడు వనవృక్షమ్ముల
పై వెలుగ నిదే వచ్చును కనుమా,
మానవసౌఖ్యమ్ముల కెల్లగ పరి
మాణము గలదు గదే ఓ చెలియా ?
　　నిద్దురబోవే ఓ చెలియా !
　　నీ వలపుంబిగియు కౌగిలిలో.

## పూ ల కి రీ ట ము

(శాఘోగీతము)

పువ్వులదండల గుచ్చవె చెలియా,
మవ్వపు నీకురులఁ జుట్టంగఁ
సల్లలితములౌ మొగ్గల సరముల
నల్లవె నీ మెత్తనిచేతులతో
పూలకిరీటము దాల్చినవారిని
పూజింతురు దేవత లని యందురు
పూలదండలను దాల్చనివారిని
పొమ్మనందురట ప్రేమను జూడకె
పువ్వులదండల గుచ్చవె చెలియా
మవ్వపు నీకురులఁ జుట్టంగన్.

## స ర్వ స మ త్వ ము

(శాఘోగీతము)

వేగుచుక్కచే నోడినతారల
పోగుజేయు నా యంగారకుడు

వెన్నెల గొఱ్ఱెలమందల గూర్చి,
బిడ్డలతల్లుల రొమ్మున జేర్చి,
లోకమున నెల్ల మృదువుం బ్రియమగా
నా కన్నెయెదకు నన్నుం దార్చు.

## ప్రియ నిరీక్షణము

(శాఘ్రోగీతము)

గున్నమావి కొమ్మలందు గువ్వలు
గుసగుసలాడుచు నుండెన్
వాడినయాకులు నిదుర జరించెడి
వాడల నాడుచునుండెన్
ఇవ్వని మాడ్చెడు మధ్యాహ్న మెల్ల
నిల్లె కాచుకొనియుంటిన్
సంజను గబగబ వచ్చు నీ యడుగు
చప్పుడు వినబడునా యంచున్.

## ప్రియ నిరీక్షణము

(శాఫోగీతము)

వాడిన గులాబియాకు లన్నియును
పడిపోయెను సోనసీటిలోనన్
కమ్మని పిల్లంగ్రోవులపాటలు
ఉమ్మరించు నిశ్శబ్దము జీల్చన్
కాని నే నిటులె వీనుల నొగ్గుచు
కాచియుండ నెంతో యాత్రముతో
అల్లదె వాకిలి మెట్లపైన నీ
యడుగులచప్పుడు వినిపించెన్.

## ప్రియ నిరీక్షణము

( శాఫోగీతము )

గడియనక జామనక కాచి కూర్చుండి
నిశ్శబ్దమగు ద్వార మీక్షించుచుందు
నీడలు గోడపై నాడుచుంబోవు
వీధి నడుగులసడి వినవచ్చుచుండె

ఆశయు సంశయ మ్మలమి నాదైన
యాలోలహృదయమ్ము నాడించుచుండె
ఎందరో యుండ్లకై యేగుదెంచెదరు
కాని నీ వింక దూరానె యుంటివిగా.

## ప్రణయ స్మృతి

(శాఖాగీతము)

*మున్నొకతటి నా హృదయతల్పమున
పవ్వళించిటివి నీలరజత జ్యోత్స్నలు
నీ సౌమ్మ్యమగు నిర్మలప్రేమను
నిలపై శీవిని నడుపంగన్
పోయె న్నెడో చంద్రుడు, చుక్కలు
బోయె, నిశీథము పోవుచున్నది,
వేళ దాటిపోయె, పాన్పుపై నే
వేసట నొంటిగ బడియుంటిన్.

* మున్నొకతరి నా హృదయతల్పమున
బన్నుంటివి నీలరజత కౌముది
యిలపై పచారుసేయగ నీ సౌ
మ్మ యగు నిర్మలప్రేమముతోన్

## వరప్రసాది

(శాఫోగీతము)

పుట్టుదు రింతులు భూమిపై లెక్క
కందని యుగ యుగాంతరములదాక
ఎంత గాలించినా యీ పృథ్వి యెల్ల
నిను బోలు కన్నియ గనరాదు నిజము
చాలంగ బ్రేమించి సంతోష మొంది
వెలి పన నెట్టిదో యెఱుగని మేటి
సమబుద్ధి యనెడు నుత్తమదాన మొసగి
నెలత! దేవతలు మన్నించిరి నిన్ను.



## మేలిముసుగు

(జేబున్నిసా)

మేలిముసుంగు నే మీదికి దీయ
నే మేమి జరుగునో యెఱుంగుదుము?
పికిలిపిట్టయు గులాబీపూవు మరచు
భక్తితో లక్ష్మిలావణ్యమ్ము గొలుచు

బ్రాహ్మణుం డా దేవి వదలి నా మోము
జూచి నాచెలువున జొక్కడునేమొ ?

కన్నుల కేరికి గానరాకుండ
పొదరింటిలో బలె పువ్వుగర్భమున
దాగియుండెడు సుగంధంబురు జోలి
మద్రచితమ్ములౌ పద్యాల నడగి
యున్న నా మోము గాంతురుగాక జనులు
మేలిముసుంగు నే నేల దీయవలె ?



## నిరాశ

(జేబున్నిసా)

అలసాలసమ్ములౌ హస్తమ్ములార !
ప్రాణేశు కౌగిలి బడయరైతిరిగ !
శుష్కించి యీరీతి జొక్కుటకన్న
విరిగిపోవుటయె మే లరసిచూడంగ.

దండుగమారి నేత్రములార! మీరు
కాంతు ని న్నేండ్లుగ గానరైతిరిగ !

బాష్పజడతను నిష్ఫలములౌకన్న
బొత్తలై పూర్తిగ పోవుటే మేలు.

కొరమాలినట్టి యో చిరిసోనలార!
చెలువుని నావ్రిక్క జేర్పరై తిరిగ!
చిన్నతనమునాటి స్నేహితు లెల్ల
రకట తమ తమ త్రోవ నరిగిరిగాదె!
వాడుగులాబిపూవా! యదృశ్యముగ
పుట్టినయట్టులే గిట్టిపోయెదవె?
ప్రియునికిరీటాన వెలయంగలేక
మద్హృదయసుమంబ! మంట గలిసితివె!



...............?

తురకను నేగాను, చి
ల్లర రాళ్లను గొలతుఁగ
వరప్రేయసిరూపము గని మ్రొక్కుచు
భక్తి నామె దలతుఁగ,
బాపడ నే గాను, య
జ్ఞోపవీతమును వీడి
ఈపగిది నామెజడను కంఠమున
నేమిపాడి తాల్పఁగ?

# అప్పచెల్లెళ్లు

(రవీంద్రుని "తోటమాలి" నుండి)

నీళ్లకోస మప్పచె
 ల్లెళ్లు పోదు రీ దారినె
 పువ్వుబోం డ్లిచటి కొచ్చి
 నవ్వుకొందు రేలనో ?
చెలులు నీళ్ల కేగునపుడు చెట్లచాటు నక్కిచూచు
సరసు డున్న సంగతి వా రెఱుగుదు రేమో ॥నీళ్ళ॥

 ఈదారిని బోవునప్పు
 డేదో గుసగుసలాడెద
 రిద్దరు, నా సరసుని గు
 ర్తెరుగుదు రేమో ! ॥నీళ్ళ॥
 సుందరు లిట కొచ్చినంత
 బిందె లిటులు నటు లొరుగుచు
 చిందిపోవు లోని నీ
 ళ్లెందుచేతనో ?
చెలులు నీళ్ళ కేగునపుడు చెట్లచాటు నక్కిచూచు
పురుషు గుండెతల్లడి వా రెఱుగుదు రేమో ? ॥నీళ్ల॥

సకియ లిచటి కొచ్చినంత
నొకరిమొగము లొకరు చూచి
కులుకుచు చిరునవ్వు నవ్వ
కొందు రేలనో?
చెకచెకమని నడచెడు నా చెలుల నడకలోని నవ్వ
చెట్లచాటున నున్న పురుషుచిత్తమును కలంచుగాదె
నీళ్ళకోస మప్ప చె
ల్లెళ్లు పోదు రీ దారినె

## ప్రేమ రాజ్యము

(*Adaption.*)

లోకముతో మన కేటికి లోలాక్షీ! రా, పోదము!
జీవితంపు సంతసమ్ము నెరిపి వంత గూర్చుపాడు
లోకముతో మన కేటికి, లోలాక్షీ, రా, పోదము.

సరసమౌ వసంతభాగ్యగరిమ మిగుల నుల్లసిల్లు
నడవులందు పండుఫలము గుడిచి మనము తనివిదీర
విచ్చినమందారపూల యచ్చమైన తేనె గ్రోలి
మచ్చమైక మొంది మేను మరచిపోయి తమకమ్మున

చెవికింపగు నాదముతో సెలయేఱులు శ్రుతి వేయగ
చివురుటాకుబోలు వేళ్ళ చెలియ! నీవు వీణె మీట,
సాకి జంతుజాలము విన, సొదల నన్ని పాఱ ద్రోలి
చేత నున్న విమలభావగీతపు పాత్రమ్ము విప్పి
శ్రవణపేయ ప్రణయగీతి చవులూరగ నేను పాడ
కానన మే స్వర్గసీమకన్న సౌఖ్య మౌగదె! ఇంక
లోకముతో మన కేటికి, లోలాక్షీ! రా పోదము.

కామాసుర

"జలజల మని పాఱెడు నీ
సెలయేటిదరిం గూర్చుని
విలపించెద వేల నిటుల
చెలియ! చెప్పవే.

చిన్నవోయె ముద్దుమోము
కన్నులంట నీరు గారు
వన్నెతరిగి వాడె మేను
కన్నె! యేలనే?

చెట్టు చామ నల్లబారె
పిట్టలన్ని గూళ్ల కేగు
చుట్టు నెల్లయెడలను చీ
కట్లు గ్రమ్మెడున్."

"మొన్న తోట గంటి నొక్క
వన్నెకాని కామరూపు
కన్నుమణగు కాంతి, వాలు
గన్నులవానిన్.

తల కొక పూదండయు, చే
తులకు కంకణములు దెచ్చి
వలపు కలిగినటుల మెల్ల
కిలకిల నులికెన్.

ఎక్కించెను తేజీపై
నొక్కతెైన గాంచ నతడు
పక్క కొఱిగి యీల వేసి
చక్కగ బాడెన్.

మలగుపండ్లు గుడువ నిచ్చి
పలవదేనె మంచుపాలు,
తెలియనట్టి బాస జెప్పె
'వలతు ని' న్నని.

సెలయేటికి దెచ్చి నన్ను
వలవల బెగ్గిలి కలగుచు
వలపున నాకన్నుల ము
ద్దుల నాల్గు గొనెన్.

మెలమెల్లన్ జో కొట్టన్
కలగంటిని - హా! ఘోరము!
విలయపుకల గంటిని యీ
సెలయేటిదరిన్.

వెల్లబోవు రాకొమరులు
తెల్లవోయి చచ్చినట్టు
లెల్ల రనిరి 'కామాసుర'
పిల్లను బట్టెన్"

వెలవెల బోవుచు కీడున్
దెలిపె వారి పెదవు లెల్ల
మెలకువయ్యె, పడియుంటిని
సెలయేటిదరిన్.

జలజల మని పారెడు నీ
సెలయేటిదరిన్ గూర్చుని
విలపింపగ కారణముం
దెలియు మియ్యదే.

## జీవితరహస్యము

ఈ జీవితమ్మన్న కేమర్థ మోయి
నా మనోహర! ప్రియా! నా రాజ! చెప్పుమ,
శరదంపు సూర్యునికిరణాలు నీదు
బంగారుశిరముపై బర్వియుండంగ.

చాందీతళుక్కుల సంజల నీదు
విమలస్వరం బిట్లు వినుపించుచుండ
మనుజుల కనుబ్రామి మాయమై చనిన
ప్రకృతిదా పరమరాహస్యమ్మదేమి ?



## అదృష్టము

భాగ్యమ్మది యనేక భంగుల మారు
సంద్రంపు తరగలచందంబు దోప
కాన నెమ్మది తెల్వి గల్గియున్నపుడె
పానమ్ము జేయు మావల నేమి యౌనో!

## ప్రణయ పారవశ్యము

సరుకుచెట్లను గాలి చల్లగా వీచె
వినతల్లియై యొద్దుకుం జనియె కెరటమ్ము
నల్లనౌ నింగిపై నక్షత్రి మొండు
తేజరిల్లెను గొప్పదీపంబువోలె
కర్ణమ్ము జోరదయ్యె కడలిశబ్దమ్ము
శూన్యమ్ములైతోచె చుక్కలుం గాలి
బంగారు నీ కురుల బావుటా నాదు
వక్షస్థలమ్ముపై బర్వియుండంగ.

## సమానావస్థ

కాంతిపక్షమ్ములతో గగనమ్మున
కడువడి బారెదు నో నక్షత్రీ!
ఇంత జెప్పరాదే ఈ రేయిని
నెచ్చట నీ పయనము నాపెదవో!
వాడి విన్ననౌ వదనముతోడుత
స్వర్గవీధి నొంటిబోవు చంద్రా!

ఏడ నీ యగాధనిశీథమ్మున
తోడు లేక నిద్రింతువె చెపుమా
ఇలు వెడలింపబడినచుట్టమటు
లిల యెల్లను దిరుగు మందపవనా!
నిలుతు వింక నేకోటరమున నే
యలపయి వేగమ తెలియంజెపుమా.

## జీవయాత్ర

జగతి నెల్లెడ వీచి చల్లనిచెట్ల
లలితమ్ములైన పల్లవములన్ పూల
సంచలింపగజేయు చల్లగాలివలె
తీరనికోర్కెతో తిరుగుదు కృష్ణ!

విశ్రాంతి యెరుగక వేదన స్రుక్క
నాలోచనాయత్తమా మదితోడ
మాధవా! నీదు గుమ్మము జేరువరకు
నీ జీవయాత్ర నెగ్గించెదనోయి!

## భా వి చిం త న ము

కాలచక్రము గతిగడచి, ప్రపంచ
భావిభాగ్య మ్మెల్ల పండినవెనుక
నానాటి కెవరైన నడుగకపోరు
'శ్రీకృష్ణు డెవ్వరు చెప్పుమా' యంచు
భాగ్యవశమ్మున భావికాలాన
నమృతతుల్యములు జీవితభారనమ్రి
ములు నైన నాగీతములు విని రాధ
ప్రేమ మగాధ మం చెఱుగకపోరు.

## ప్రే మ మా య

కల్ల గాదిది నమ్మగా దగు సకియ!
వంగెడు బంగారు వరిపైరుపోలె
జలజల ప్రవహించు జలముంబోలె
వనిత నా హృదయమ్ము పడిలేచుచుండె.
ఆదృశ్య మైవచ్చు నాతనిశక్తి
వార్ధినుండి ప్రచండవాయువుబోలె,
అతని దూరాన నరసిన యంత
కారణమ్మును నెఱుంగకయె మొ్రక్కెదను.

## అవతారసమాప్తి

నీవు నెమ్మది నుంటి వేముంది చెప్పు?
నీవు మరణము నొంది తేముంది చేయు?
నీయాత్మ యాం పరమేశుసన్నిధిని
జేర నింకేముంది నేరుచుకొనగ?
నీ వంత మొంద నాకీజీవ మేల?
అర్థమ్ము లేని వైభవము కీర్తియును
కలిసి ముచ్చటలాడు చెలికాడు లేక
వేచి చూడందగు విభునీడ లేక!

## బాలకృష్ణుడు

బంగారు పుష్పమ్మువలె ముద్దుగులుకు
చిన్నారి పొన్నారి చిట్టి నాతండ్రి
సకలసంపదలైన స్వారాజ్యమైన
నాచిన్ని కృష్ణుకన్నను నెక్కువౌనె?

## మురళీకృష్ణుడు

వాయింపుమా మురళి వాయింపు కృష్ణ!
తుమ్మెదగండ్లు జుంజుమ్మని పాడు
శారదరమణియు సందర్శింపరాజు
నానందమున నోలలాడుచున్నారు
వాయింపుమా మురళి వాయింపు కృష్ణ!
వాయింపుమా మురళి స్వచ్ఛముగ కృష్ణ!

పండ్లు పైరులు మిగుల బండియున్న వవె
రతిరాజు లోకసామ్రాజ్యమ్ము నేలు
నీవేళ చింతల కెడ మేడదోయి!
స్వచ్ఛమ్ముగా మురళి వాయింపు కృష్ణ!
వాయింపుమా మురళి వాయింపు కృష్ణ!

## వి ర హ ము

ఏడ తిరుగాడెదవు కృష్ణా!
ఈ
వాడకే రావైతి కృష్ణా!
నీపైని మోహమున కృష్ణా!
నే
నిలువలేకుంటిరా కృష్ణా!
కాల్చుచున్నది జ్వరము కృష్ణా!
నా
కాలుసేతులు వడకు కృష్ణా!
ఆస లడుగంటెరా కృష్ణా!
ఆ
యాసమున బల ముడిగె కృష్ణా!
బాలభానునియట్ల కృష్ణా!
నీవు
వచ్చి న న్నలరింపు కృష్ణా!
వదనకాంతుల జిమ్మ కృష్ణా!
నా
పరితాప మార్పరా కృష్ణా?

# వసంతాగమము

గున్నమావి తోటలోన
గువ్వ యొకటి గూడు కట్టి
సరసుడౌ వసంతు రాక
కొఱకు తమిని వేచియుండె.

కాని నామనమ్ము మిగుల
కలచుచు హృదయమ్ములోన
మరగు వలపు తలపు నెవ్వ
రెఱిగింతురు నీకు కృష్ణ!

పగ లెల్లను ధాత్రీరమ
పచ్చనిపుట్టమ్ము గట్టి
పసుపుపూల దాల్చి బాల
పవను గూడి తిరుగుచుండ

చల్లనైన చెట్టునీడ
నల్ల మలర గూరుచుండి
వనము కవల బారుసోన
పాటలు వినుచుందు కృష్ణ!

## గో ప బా లు లే న గు మో ము

( కృష్ణకర్ణామృతమునుండి )

శైవుడనె, యించుకేని సంశయము లేదు,
భక్తి బంచాక్షరీమంత్రపఠన సేతు
నట్టు లయ్యు నతసీకుసుమావభాస
గోపబాలు లేనగుమోమె గోరు మనము.



## తె లి వి మా లి తె లి య నై తి

( శంకరుని శివానందలహరినుండి )

దేవ దేవ! శంభో! నిను
తెలివిమాలి తెలియనైతి!
నిరతము భావమున దోచు
నీదు పాదసన్నిధి నా
చేతస్సరసిజ మర్పణ
జేసి సుఖము గాంచలేక,
ఘోరవిజనవిపినముల, X

క్షీరపు కాసారముల వి
శాలశైలముల బడీ పూ
జాకుసుమార్థము తిరిగెద,
దేవదేవ శంభో! నిను
తెలివిమాలి తెలియనైతి!



## రామకథాసుధ

(శంకరుని రామకర్ణామృతమునుండి)

మార్గమందున మార్గమందున
వృక్షశాఖల రత్నవేదులు
వేదులందున వేదులందున
కిన్నరీబృందములగీతము,
గీతమందున గీతమందున
మంజులాలాపార్ద్రిగోష్ఠియు
గోష్ఠియందున గోష్ఠియందున
నీదుకథయే రామచంద్రా!

వృక్షమందున వృక్షమందున
వీక్షితములౌ పక్షిసంఘాల్,
సంఘమందున సంఘమందున
మంజులామోదార్ద్రవాక్యము,
వాక్యమందున వాక్యమందున
మంజులాలాపార్ద్రగోష్ఠియు,
గోష్ఠియందున గోష్ఠియందున
నీదుకథయే రామచంద్రా!

## సీ తా వి ర హ ము

(రామవాక్యము)

ప్రాసాదమ్మున నీవే!
పథము పథమునను నీవే!
పృష్ఠభాగమున నీవే!
పురోభాగమున నీవే!
పర్యంకమ్మున నీవే!
పలుదిశలందున నీవే!
కనంబడెద, ఘోర, వియో
గాతురమౌ నామదికిని.

అహా, యెంత చిత్రమైన
దగును నాదు చేతముతీ
రపరమేమి తోచదయ్యొ
నతివమిన్న! నీవుదక్క!
నీవే! నీవే! నీవే!
నీవే! నీవే! నీవే!
అఖిలజగతియందీయ
ద్వైతభావ మెట్టిదియో!



## మా గాంధి

కొల్లాయి గట్టితే నేమి,
మాగాంధి,
కోమటై పుట్టితే నేమి? ॥కొల్లాయి॥
వెన్నపూసా మనసు
కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మ తేజస్సు ॥కొల్లాయి॥

నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక
నాలుగూ వేదాల
నాణ్య మెరిగిన పిలక ||కొల్లాయి||

బోసినో ర్విప్పితే
ముత్యాల తొలకరే
చిఱునవ్వు నవ్వితే
వరహాల వర్షమే ||కొల్లాయి||

చకచక నడిస్తేను
జగతి కంపించేను
పలుకు పలికితేను
బ్రిహ్మవాక్కేను ||కొల్లాయి||

కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రిహ్మఋషి
నేడు కోమటిబిడ్డ
కూడ బ్రిహ్మర్షాయె ||కొల్లాయి||

# గాంధీ ప్రభ

గాంధిమహాత్ముడు బయలుదేరగా కలకల నవ్వింది,
జగత్తూ, కలకల నవ్వింది ॥గాంధి॥

గాంధిమహాత్ముడు చకచక నడువగ కంపించి పోయిందీ,
భూదేవీ, కంపించిపోయింది ॥గాంధి॥

గాంధిమహాత్ముడు కన్ను విప్పగా గడగడ వణకిందీ,
అధర్మము, గడగడ వణకిందీ ॥గాంధి॥

గాంధిమహాత్ముడు నవ్వు నవ్వగా కన్నుల గట్టిందీ,
స్వరాజ్యం, కన్నుల గట్టిందీ ॥గాంధి॥

గాంధిమహాత్ముడు గొంతు విప్పగా, గణగణ మ్రోగిందీ,
ప్రణవము, గణగణ మ్రోగిందీ ॥గాంధి॥

గాంధిమహాత్ముడు స్వస్తి బాడగా కరముల దొరికిందీ,
మోక్షము, కరముల దొరికిందీ ॥గాంధి॥

## ఈ జన్మము

ఈ జన్మ మిక దుర్లభమురా,
ఏ జన్మసుకృతమో ఈనాడు బ్రతికుంటి మీ॥

ఈశ్వరుడే గాంధిగా ఇల నవతరించాడు
అందులో మము గన్న, హిందూమాతకడుపున నీ॥

ధర్మదేవత మూర్తి దాల్చింది గాంధిగా,
కల్లార మన మతని, గాంచి ధన్యుల మైతి మీ॥

భారతలక్ష్మికి, భాగ్యరేఖా గాంధి,
అతడే మననాయకు,డాయె నెంతటిభాగ్యమీ॥

ఈశోభ గనుభాగ్య, మే నోముపంటో,
ఈయజ్ఞములో చావు, యేపుణ్యఫలమో

ఈజన్మ మిక దుర్లభమురా,
యేజన్మసుకృతమో, ఈనాడు బ్రతికుంటిమీ॥

"వే ణు నా ద ము"

వేణునాదము మోగుతుందండోయ్
ఓభక్తులారా
వేణునాదము మోగుతుందండోయ్ ॥వేణు॥

వేగుజామూ కోడికూసె
వేగుచుక్కా తూర్పున బొడిచె
వేగమె నిద్దురలేచి రండోయ్
వేళ మించిపోయేనండోయ్ ॥వేణు॥

భారతదేశపు దాస్యము బాపగ
పయన మాయె మోహనగాంధీ,
చావో జయమో తేలందే యీ
జన్మకిక మళ్ళీ కనబడడండోయ్ ॥వేణు॥

భార్యల విడిచీ భర్తలు రండోయ్
భర్తల విడిచీ భార్యలురండోయ్
తల్లుల విడిచీ పిల్లలు రండోయ్
పిల్లల విడిచీ తల్లులు రండోయ్ ॥వేణు॥

పాపాలన్నీ పటాపంచలై
పరమేశ్వరుసన్నిధిలో జన్మము

ధన్యత జెందీ ముక్తిని బొందే
తరుణము దొరికెను మరి రాదండోయ్
వేణునాదము మోగుతుందండోయ్
ఓభక్తులారా!
వేణునాదము మోగుతుందండోయ్

## "మత్తుమందు"

ఎవరేశారీ మత్తుమందు,
ఎన్నాళ్లదాకాను, ఈమొద్దునిద్దర ॥ఎవరే॥
నల్లమందైతేను, నాలుగ్గడియలవరకె
కల్లు మత్తైతే పది, గడియలవరకేను ॥ఎవరే॥
తాచువిషము కూడ, తగ్గేను మంత్రముతో
ఏదివ్యమంత్రముతో, యీమత్తు తగ్గేనో ॥ఎవరే॥
గాంధీమహాత్ముడు, కనిపెట్టినట్టి యీ
సత్యాగ్రహమంత్రముతో, మత్తు వదిలేనేమో
ఎవరేశా రీమత్తుమందూ
ఎన్నాళ్లదాకాను యీ మొద్దునిద్దర? ॥ఎవరే॥

## మా ల మా ది గ ల మొ ఱ

గాంధీమహాత్మ, గాంధీమహాత్మ,
కాచి రచ్చించు గాంధీమహాత్మ॥
సరకారువోరు, కరుకైనవోరు,
ఉప్పేరితేను తప్పేశినోరు ॥గాంధి॥
డబ్బుగలోరు, దరికి రానీరు,
ఈగోర మేమి మానేర మేమి ? ॥గాంధి॥
మాలమాదిగలం, మనసులం గామా ?
కుక్కలకన్నా తక్కువయ్యామా ॥గాంధి॥
మామొఱాలించ, సామోరె దిక్కు,
ఆసామివోరి, అవుతారమైన
గాంధీమహాత్మ గాంధీమహాత్మ
కాచి రచ్చించు గాంధీమహాత్మ.



## స్వ రా జ్య ల క్ష్మి పెం డ్లి

పోదాము స్వరాజ్యలక్ష్మిపెండ్లి జూడ
రారే రమణులారా! ॥

ముత్యాల ముగ్గులూ, రత్నాల తోరణాలు
మాణిక్యాల మంటపమటా,
మన లక్ష్మి పెండ్లికి ॥పోదాము॥

సంద్రమె పెళ్ళిల్లంట, సదస్యులు దేవతలంట
ఉప్పే తలంబ్రాలటా,
మన లక్ష్మి పెండ్లికి ॥పోదాము॥

గాంధీ వశిష్ఠుంట, కస్తురమ్మ ముత్తైదంట
పరమాత్ముడే సాక్షిటా,
మన లక్ష్మి పెండ్లికి,
పోదాము స్వరాజ్యలక్ష్మి పెండ్లిజూడ
రావే రమణులారా!

## జాతీయ పతాకము

పతాకోత్సవము సేయండీ
స్వతంత్రభారత జాతిచిహ్నమా ॥ప॥

కొత్తవన్నెలూ కొత్తచిన్నెలూ
కొత్తజీవమూ కొమ రొప్పంగా

నూతనభారతజాతికి భువిలో
ఖ్యాతీ జయమూ కలగాలంటూ ॥ప॥

వీరకేసరుల యెఱ్ఱనిరంగూ
దేశసేవకుల తెల్లనిరంగూ
భక్తులపాలిటి పచ్చనిరంగూ
బీదలపెన్నిధి రాటపుమెఱపే ॥ప॥

అన్నిమతాలకు అన్నితెగలకూ
ఆశ్రియ మీజండా ఒకటేనోయ్
ప్రాణము పోతే పోనీ జండా
మానముమాత్రము మంటగలపక ॥ప॥



## రాట్నము

సిగ్గు లేదా నీకు శిరము లేదా
అన్నమైనా లేక బీద లల్లాడుతుంటేను
సీతాకోక చిలుకలాగ సీమగుడ్డ కట్టితిరుగ ॥సి॥

పూటకూడులేని ప్రజకు రాట్నమొకటే పెన్నిధుండ
మోటంచు పవిత్రమైన రాటంఖద్దరు వెక్కిరింప ॥సి॥

అంగడిలో అన్నీ యుంటే అల్లుడినోట శనన్నట్లు
భాగ్యరాశి భారతభూమి పరదేశపు సరకులేల? ॥సి॥

## బాపూజీ — మా బాప్

పోర్ బందర్ కోమటింట పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి మెట్టినాడోయ్
కొత్త యేసు క్రీస్తు అవతరించినాడోయ్
కొట్టకె పగవాళ్ళపొగరు దించినాడోయ్
పోర్ బందర్॥

హిందూ పైగంబర్ జన్మించినాడోయ్
అల్లావహో అక్బరంటు అరిచినాడోయ్
పోర్ బందర్॥

చీమను సింహాసన మెక్కించినాడోయ్
రాతి నాతి జేసిన శ్రీరాముడేనోయ్
పోర్ బందర్॥

ధర్మముకై ప్రాణి పందెమొడ్డినాడోయ్
తాళలేక శత్రువులూ తలకిందైరోయ్
పోర్ బందర్॥

చేతులు పైకెత్తి జేజే లనండోయ్
బాపుజీ ప్రపంచపు మాబా పనండోయ్.

పోర్‌బందర్॥

## ప్రేమ కారణము

(సెలయేటి గానము నుండి)

కారణం బేమనందు నో కాంత, నీదు
ముద్దుమో మందమో, లేక, మోహపార
వశత నిటు నటు చలియించు వాలుకనుల
యందమో కెంపు పెదవులసందు నుంచి
తొంగి చూచుచు వెంటనే తొలగి లోని
కేగుచును మోముసీమపై నిచట నచట
మెఱుపు మెఱపించు మవ్వంపు చిఱునగవుల
చందమో, లేక ముంగురు లందమానో!

ప్రేమకుఁ గల్గుకారణం బేమనగల
మింతిరో నిన్నుఁజూడ ప్రేమించుటె జుమి!
ఇంతియేగాని వేఱ్వేఱ నెంచి చూచి
అందపుం దళుకులనె ప్రేమనందగలనె!

తెలియు పరాత్మను ఆత్మను కలిపి కట్టు
దారమే నాదు ప్రేమకు గారణమ్ము.

## సహజలావణ్యము

( సెలయేటిగానము నుండి )

మోముతీరు సామాన్యమే, ముగుద, కురులు
ముడిచి, కుంకుమతిలకమ్ము మోమున నిడి
నంతనే యింత సొగ సెట్టు లబ్బె, జెప్ప
వే చెలి, వినంగ నామది వేడ్కవుట్టె.
తీగదీపమ్ము దీప్తి నల్దెసల బర్వి
చదల చీకటి నిటు నటు కదలబాఱ
జేయుచుండ, నొయారమ్ము చెలగ నిలిచి
మాటలాడెడి నీసౌరు మనము గొనియె
చెలియరో! దేవలోకమ్ము చెడెల వగు
లోపమేలేని యుత్తమరూపములను
గంటిగాని, యదేమొ నా కన్నులకును
నీదుమూర్తియె మోదమ్ము నించె, నిజము.
ఉత్తమాకృతి జీవసంపత్తి గలుగు
సహజలావణ్యమున కెట్లు సాటివచ్చు?



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B165 |
| పుస్తకం పేరు | బసవరాజు అప్పారావు గీతములు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 211 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |